శ్రీమతే రామానుజాయ నమః



శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన

# అష్టశ్లోకి

ఆంధ్రవివరణం

పండితరత్న

ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర

ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగరామానుజాచార్య స్వామివారి

92వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక-2016

**సమర్పణము :**

**శ్రీమాన్ అల్లూరి శ్రీరామరాజుగారు,**

**శ్రీమతి సీతమ్మ దంపతులు, వారి కుటుంబ సభ్యులు**

**అష్టశ్లోకి – శ్రీపరాశరభట్టర్**

**శ్రీవరవరమునినక్షత్రమాలికాస్తవం – శ్రీశ్రీనివాససూరి**

**ఆంధ్రవివరణం - ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**


ప్రథమముద్రణ : మార్చి, 2016

ప్రతులు : 500

ఆవిష్కరణ సందర్భం : శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారి 92వ తిరునక్షత్రోత్సవము – పాల్గుణ మాసం – స్వాతి

తేది : 26–3–2016

ముఖచిత్రం : శ్రీ పరాశరభట్టర్


**ఈగ్రంథం న్యాయవేదాన్త విద్వాన్, ఉభయవేదాంత భాస్కర ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య (రంగాచార్య) స్వామివారి 92వ తిరునక్షత్రోత్సవ దివ్యస్మృతిగా శ్రీమాన్ అల్లూరి శ్రీరామరాజుగారు, శ్రీమతి సీతమ్మ దంపతులచే, వారి కుటుంబ సభ్యులచే భక్తిపూర్వకంగా ముద్రింపబడింది.**


**ప్రతులకు**

**1. ఈ.ఏ. శింగరాచార్యులు**

18–3–58/7, శాంతినగర్, కె.టి.రోడ్.

తిరుపతి–517 507

ఫోన్ : 09885003420



డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి

ప్రింటింగ్ : సి.ఎన్.ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి




# సప్రశ్రయ సమర్పణం

వేదకాలం నుండి ఎనిమిది సంఖ్యతో వివక్షితార్థాన్ని ప్రతిపాదించే ప్రక్రియ ప్రసిద్ధిచెందింది. ఎనిమిది వాక్యాలతో ఒక్కొక్క నక్షత్రాధిదేవతను స్తుతించే ప్రక్రియ దీనికి ఉదాహరణం. హర్యష్టకం, నృసింహాష్టకం, శ్రీసుదర్శనాష్టకం – ఇత్యాదిగా ఎన్నో స్తోత్రాలు ఎనిమిది అనే సంఖ్య యొక్క ప్రాధాన్యాన్ని కలిగినవి. శ్రీపరాశర భట్టర్ అనుగ్రహించిన అష్టశ్లోకి కూడా ఎనిమిది శ్లోకాలతో రచింపబడింది. ఈ శ్లోకాలు విభిన్న వృత్తాలలో రచింపబడ్డాయి. ఈ స్తోత్రం నిత్యానుసంధేయంగా ప్రసిద్ధిచెందింది. ఇందులోని మొదటి నాలుగు శ్లోకాలు అష్టాక్షరిని, తర్వాతి రెండు శ్లోకాలు ద్వయాన్ని, చివరి రెండు శ్లోకాలు చరమశ్లోకాన్ని వివరిస్తున్నాయి. ప్రస్తుతం ఈ స్తుతి తెలుగు వివరణంతో ముద్రింపబడు తున్నది. దీనితోపాటుగా శ్రీవరవర మునుల వైభవాన్ని తెలియజేసే అపూర్వమైన నక్షత్రమాలికా స్తోత్రం కూడా ఆంధ్ర వివరణంతో పాఠకలోకానికి సమర్పింపబడుతున్నది. ఈ స్తుతిని శ్రీనివాససూరి అనే మహనీయులు రచించినట్లుగా తెలుస్తున్నది. ఇది ఇంతవరకు తెలుగుభాషలో ముద్రింప బడలేదు. సుమారు 25 సం॥లకు పూర్వం **గీతాచార్యన్** అనే తమిళ మాసపత్రికలో తమిళ వివరణంతో ముద్రింపబడింది.

ఈ రెండు స్తోత్రాలకు ఆంధ్రవివరణాన్ని అందించిన ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారికి కృతజ్ఞతావిష్కరణను చేసుకొంటున్నాము. ఈ లఘు గ్రంథం మా పితృపాదులు, **న్యాయవేదాన్త విద్వాన్, ఉభయవేదాంత భాస్కర,ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి 92వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపికగా** శ్రీమాన్ అల్లూరి శ్రీరామరాజుగారు, శ్రీమతి సీతమ్మ దంపతులు, వారి కుటుంబ సభ్యులచే భక్తిపూర్వకంగా సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడి ప్రపన్న పాఠక లోకానికి సమర్పింపబడుతున్నది. ఈ సత్కార్యాన్ని ఆచార్య కైంకర్యరూపంగా చేసికొన్న వీరికి నా హృదయపూర్వక అభినందనలు, మంగళాశాసనాలు. ఈ గ్రంథం ఆస్తిక పాఠక లోకానికి ఆనందాన్ని కలిగించగలదని నమ్ముతున్నాను. స్వస్తి.

**రంగరామానుజాచార్య జన్మర్క్షోత్సవచిహ్నికా ।**
**తన్ముఖోల్లాసకత్వేన కృతిస్సేయం ప్రకాశ్యతే ॥**

తిరుపతి — ఇట్లు, భాగవత విధేయుడు

12–3–2016 — **ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన

# అష్టశ్లోకి

శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।
శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥



1) అకారార్థో విష్ణుః జగదుదయరక్షాప్రళయకృత్
మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవ మిదమ్ ।
ఉకారోఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః
త్రయీసారస్త్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ ॥

2) మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసః స్వరూపం గతిః
గమ్యం శిక్షిత మీక్షితేన పురతః పశ్చాదపి స్థానతః ।
స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తిశ్చ నాన్యోచితా
తస్యైవేతి హరేః వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః ॥

3) అకారార్థాయైవ స్వమహ మథ మహ్యం న నివహాః
నరాణాం నిత్యానా మయనమితి నారాయణపదమ్ ।
యమాహాస్మై కాలం సకలమపి సర్వత్ర సకలాసు
అవస్థాసు ఆవిఃస్యుః మమ సహజకైంకర్యవిధయః ॥

4) దేహాసక్తాత్మబుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యాత్ తృతీయం
స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమ మితరశేషత్వధీశ్చేత్ ద్వితీయమ్ ।
ఆత్మత్రాణోన్ముఖశ్చేత్ నమ ఇతి చ పదం బాంధవాభాసలోలః
శబ్దం నారాయణాఖ్యం విషయచపలధీశ్చేత్ చతుర్థీం ప్రపన్నః ॥

5) నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనం చ
ఉపాయం కర్తవ్యభాగం త్వథ మిథునపరం ప్రాప్య మేవం ప్రసిద్ధమ్।
స్వామిత్వం ప్రార్థనాం చ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాన్
మంతారం త్రాయతే చేత్ అధిగతనిగమః షట్పదోఽయం ద్విఖండః॥

6) ఈశానాం జగతా మధీశదయితాం నిత్యానపాయాం శ్రియం
సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణస్యాంఘ్రీ హరేరాశ్రయే ।
ఇష్టోపాయతయా శ్రియా చ సహితాయాత్మేశ్వరాయార్థయే
కర్తుం దాస్య మశేష మప్రతిహతం నిత్యం త్వహం నిర్మమః ॥

7) మత్ప్రాప్త్యర్థతయా మయోక్త మఖిలం సంత్యజ్య ధర్మం పునః
మామేకం మదవాప్తయే శరణ మిత్యార్తోఽవసాయం కురు ।
త్వామేవం వ్యవసాయయుక్త మఖిలజ్ఞానాదిపూర్ణోఽహ్యహం
మత్ప్రాప్తిప్రతిబంధకై ర్విరహితం కుర్యాం శుచం మా కృథాః ॥

8) నిశ్చిత్య త్వదధీనతాం మయి సదా కర్మాద్యుపాయాన్ హరే
కర్తుం త్యక్తుమపి ప్రపత్తు మనలం సీదామి దుఃఖాకులః ।
ఏతత్ జ్ఞానముపేయుషో మమ పునః సర్వాపరాధక్షయం
కర్తాసీతి దృఢోఽస్మి తే తు చరమం వాక్యం స్మరన్ సారథేః ॥



**శ్రీమతే రామానుజాయ నమః**



**శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన**

# అష్టశ్లోకి

## ఆంధ్రవివరణం

## అవతారిక

సంసారమనే మహాసాగరంలో పడి క్లేశపడే మనం పరమపదాన్ని పొందడానికి తెలియదగిన విషయాలనేకం ఉన్నాయి. వాటిలో ముఖ్యంగా తెలియవలసిన విషయాలు అయిదు. అవి అర్థపంచక మనబడతాయి. అవి ఏవి? అంటే, 1) భగవానుని స్వరూపం, 2) జీవాత్మస్వరూపం, 3) మనం అనుష్ఠించవలసిన ఉపాయంయొక్క స్వరూపం, 4) మనం పొందదగిన పురుషార్థంయొక్క స్వరూపం, 5) దానిని పొందనివ్వకుండా అడ్డుపడే విరోధియొక్క స్వరూపం.

ఈ విధంగా ఈ అయిదు విషయాలను యథాతథంగా తెలుసుకోవడమే అర్థపంచకజ్ఞానమనబడుతుంది. ఈ జ్ఞానాన్ని విస్తృతంగా తెలియజేయడంకోసమే ఉజ్జీవన (మోక్ష) శాస్త్రాలు అనేకం ఆవిర్భవించాయి. వేదాలు, వాటిని వివరించే ఇతిహాసపురాణాలు, దివ్యప్రబంధాలు–ఇలా అన్ని ప్రమాణాలు పైన పేర్కొన్న అర్థపంచకాన్ని విశదీకరించడంకోసమే అవతరించాయి.

ఆ ప్రమాణాలన్నిటిలో తిరుమంత్రం, ద్వయం, చరమశ్లోకం–అనే రహస్యత్రయమే చాలా ప్రధానంగా ప్రకాశించే ప్రమాణం కనుక, ఆ మూడు రహస్యాలద్వారా అర్థపంచకజ్ఞానాన్ని పొందడమే మిక్కిలి యుక్తం. ఈ రహస్యత్రయంకూడా కరుణాసముద్రుడైన భగవానునిచే ఈలోకంలో ప్రవర్తింపజేయబడ్డాయి. అందువల్లనే ఆచార్య పరంపరలోని మొదటి స్థానం భగవానునిదే అయినది. కనుక **"లక్ష్మీనాథసమారంభామ్......వందే గురుపరంపరామ్"** అని కూరేశులు గురు పరంపరను అనుసంధించారు.



ఈ రహస్యత్రయం శబ్దస్వరూపంలో సంగ్రహంగా ఉన్నా, గంభీరమైన, అరుదైన మహార్థాలను ఇముడ్చుకొన్నది. కనుక, సకలశాస్త్ర సముద్రపారంగతులైన మన పూర్వాచార్యులు వీనిలోని గంభీరార్థాలను గ్రహించి, పరమకృపతో, తమను ఆశ్రయించినవారికి అరుదైన ఔషధంవలె ఉపదేశించారు. భగవద్రామానుజులకు ముందున్న ఆచార్యులు ఈ రహస్యత్రయంలోని గొప్ప అర్థాలను చక్కగా గ్రహించి, రక్షిస్తూ, ఏకాంతంగానే ఉపదేశిస్తూ వచ్చారు. శ్రీరామానుజులు, తమ ఉదారమైన, విశాలమైన మనస్సులో సంసారులందఱిపట్ల గల కరుణ పొంగి పొర్లి, అవధి దాటినవారైనందున, తాముపదేశించి, తమ శిష్యులద్వారా ఉపదేశింపజేస్తూ వచ్చారు. ఈవిషయాన్ని శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో **"ఓరాణ్ వழి యాయ్ ఉపదేశిత్తార్ మున్నోర్, ఏరార్ ఎతిరాశర్ ఇన్నరుళాల్ పారులగిల్ ఆశైయుడైయోర్ క్కెల్లామ్, ఆరియర్కాళ్! కూఱుమెన్డు పేశి వరమ్బుఱుత్తార్ పిన్"** (పూర్వాచార్యులు, ఒక గొప్పక్రమంలో, యోగ్యతను పరీక్షించి ఉపదేశించారు. కాని, కరుణాపూర్ణులైన శ్రీరామానుజులు గొప్ప కరుణతో ఈ లోకంలో ఆశను కలవారికి అందఱికి, ఓ ఆచార్యులారా ! ఉపదేశించండి– అని పూర్వక్రమాన్ని ఛేదించారు.) అనే పాశురంద్వారా వ్యక్తం చేశారు.

శ్రీరామానుజుల కాలంనుండి సంప్రదాయార్థవిశేషాలు విరివిగా ఉపదేశింప బడినా, రహస్యత్రయంయొక్క అర్థవిశేషాలను ఆ కాలంలో గ్రంథస్థం చేసి అనంతర కాలం వారికి ఉపయోగపడేటట్లుగా ఉపకరించినవారు ఇంచుమించుగా ఎవరూ లేరనే చెప్పాలి రహస్యత్రయవ్యాఖ్యానరూపంగా ఒక గ్రంథాన్ని కూరేశులు అనుగ్రహించినట్లు శ్రీదేశికుల రహస్యత్రయసారంద్వారా ఊహించే అవకాశం ఉన్నది. అయితే, ఆ గ్రంథం కాలక్రమంలో లోపించింది.

వారి పుత్రులు పరాశరభట్టర్ అనుగ్రహించిన అష్టశ్లోకి–అనే గ్రంథమే రహస్యత్రయాత్మక గ్రంథాలలో మొట్టమొదటిదిగా ప్రకాశిస్తున్నది. ఎనిమిది శ్లోకాలను కల్గినందున **"అష్టశ్లోకి"** అనే పేరు ఈ కృతికి ఏర్పడింది. ఇందులోని మొదటి నాల్గు శ్లోకాల ద్వారా తిరుమంత్రార్థం వివరింపబడింది. ఆతరువాత రెండు శ్లోకాలలో ద్వయార్థం తెలుపబడింది. ఆ పిమ్మట గల చివరి రెండు శ్లోకాలలో చరమశ్లోకార్థం తెలుపబడింది. ఈవిధంగా ఎనిమిది శ్లోకాలద్వారా మూడు రహస్యాలలోని గంభీరాలైన అర్థాలు అందంగా నిరూపింపబడ్డాయి.

అరుదైన గొప్ప అర్థవిశేషాలు ఎనిమిది శ్లోకాలలో ఇమిడి ఉన్నందున అందఱికి సులభంగా అర్థం ప్రకాశించేటట్లుగా ఒక వ్యాఖ్య రచింపబడడం అత్యావశ్యకమైనందున, పూర్వాచార్యులు చూపిన మార్గంలో తగిన ఒక వివరణ వ్రాయబడుతున్నది.



**శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।**
**శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥**

శ్రీరంగనాథుని పురోహితులు, శ్రీవత్సాంకులనబడే కూరేశుల పుత్రులు, జ్ఞానభక్తులనే సంపదను కలవారైన శ్రీపరాశరభట్టార్యులు నాకు గొప్ప మంచిని కల్గించాలి.

(ఇది పరాశరభట్టర్ ప్రార్థనా శ్లోకం. ఈ స్తుతిలోని ఎనిమిది శ్లోకాలు అష్టాక్షరి, ద్వయం, శ్రీకృష్ణచరమశ్లోకాలనే మూడు రహస్యాలలోని అర్థాన్ని విశదం చేస్తున్నవి. దీనిని ఉదయం ఆరాధనకు ముందు చెప్పుకోవడం సదాచారం.)



# అష్టశ్లోకి

## అష్టాక్షరీమంత్రార్థం

1) **అకారార్థో విష్ణుః జగదుదయరక్షాప్రళయకృత్**
**మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవ మిదమ్ ।**
**ఉకారోఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః**
**త్రయీసారస్త్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ ॥**

సకలజగత్తుల సృష్టి-స్థితి-సంహారాలను చేసేవాడైన, సర్వవ్యాపకుడైన విష్ణువు ప్రణవం (ఓంకారం)లోని అకారంచేత తెలుపబడుతున్నాడు. జ్ఞానానందాలను స్వరూపంగా కల్గిన జీవాత్మ మకారంచేత చెప్పబడుతున్నాడు. ఈ జీవాత్మ, భగవానునకు మాత్రమే చెందిన శేషవస్తువు - అనేది అకారంపై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తిచే తెలుపబడుతున్నది. ఇక, ప్రణవంలోని ఉకారం (అకార మకారాలకు మధ్యలో ఉండే ఉకారం) ఈ జీవాత్మ, పరమాత్మల మధ్య ఉండే సంబంధాన్ని పతిపత్నీభావ సంబంధంవలె ఐకాంతికమని నియమిస్తున్నది. ఏవిధంగా భార్య, ఆమె భర్తకు మాత్రమే చెందినదై ఉంటుందో, ఆ విధంగానే భగవానునకు భార్యవంటివారైన జీవులు, తమకు భర్తవంటి వాడైన శ్రీమన్నారాయణునకు మాత్రమే చెందినవారు - అనే అనన్యార్హమైన - ఇంకొకరికి చెందని - సంబంధాన్ని ఉకారం నియమిస్తున్నది. ఈ విధంగా వివరింపబడిన అర్థాన్ని ఋగ్వేద - యజుర్వేద - సామవేదాలనే మూడు వేదాల సారంగాను, మూడు అక్షరాల రూపంగాను, మూడు పదాల రూపంగాను ఉండే ఓంకారం (ప్రణవం) తెలుపుతున్నది.



ఈశ్లోకం ద్వారా ప్రణవార్థం వివరింపబడుతున్నది. తిరుమంత్రం- ఎనిమిది అక్షరాలను, మూడు పదాలను కల్గి ఉన్నది. వాటిలో, ప్రణవం (ఓంకారం) మొదటి పదం. అకారం, ఉకారం, కలిసి గుణసంధిని పొందినపుడు **"ఓ"** అని అవుతుంది. దానికి పిమ్మట మకారం ఉన్నందున **"ఓమ్"** అనే ఈ ప్రణవం అకార, ఉకార, మకారాలనే మూడు అక్షరాల రూపంలో ఉన్నది.

శ్రుతులలో **"ఓమిత్యేకాక్షరమ్"** అని ప్రణవం ఒకే అక్షరంగా చెప్పబడగా, మూడు అక్షరాలను కల్గినదిగా దానిని పల్కడం తగునా? అని కొందరు ఇక్కడ సందేహించవచ్చు. సమాధానం వినండి. ఇందులో ప్రణవానికి సంహితాకారం, అసంహితాకారం- అనే రెండు ఆకారాలున్నాయి. సంధిని పొందిన ఆకారాన్ని సంహితాకారమని, సంధిని పొందని ఆకారాన్ని అసంహితాకారమని అంటారు. అసంహితాకారాన్ని పురస్కరించుకొని చూచినపుడు- ప్రణవం మూడు అక్షరాల రూపంలోను, ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క పదంగాను ఉంటుంది కనుక, ప్రణవం పదత్రయాత్మకమై ఉంటుంది. సంహితాకారాన్ని పురస్కరించుకొని చూచినపుడు ఒకే అక్షరంగా, ఒకే పదంగా ఉంటుంది. అందువల్ల **"ఓమిత్యేకాక్షరమ్"** అని శ్రుతి పల్కినది సంహితాకారాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినది-అని గ్రహించాలి. ఈవిధంగా ఇంతవరకు శ్లోకంలోని **"త్ర్యాత్మా"** అనే పదం వివరింపబడింది.

ఇక **"త్రయీసారః"** అనే పదం వివరింపబడుతున్నది. ఈ ప్రణవంలోని అక్షరాలు అకార-ఉకార-మకారాలు ఋగ్వేద-యజుర్వేద- సామవేదాలనే మూడు వేదాలనుండి **"భూః, భువః, సువః"** అనే వ్యాహృతులు మూడింటిని సర్వేశ్వరుడు ఆవిర్భవింపజేసి, ఆ మూడింటిని తన సంకల్పంతో వడబోసి, వాటినుండి అకార-ఉకార-మకారాలనే మూడు అక్షరాలను క్రమేణ ఆవిర్భవింపజేశాడు. ఈవిధంగా సముద్ధరించినందున ఈమూడు అక్షరాలు ఋగ్వాది మూడు వేదాల సారం.

కనుక ఇటువంటి ప్రణవమనే ప్రమాణంలోని అక్షరత్రయంలో తెలిపే అర్థాన్ని ఈ శ్లోకంలోని మూడే పాదాలు వివరిస్తున్నాయి. మొదటి పాదం అకారార్థ వివరణం. సకలజగత్తుల సృష్టిస్థితిసంహారాలను నిర్వహించేవాడైన భగవానుని అకారం తెల్పుతున్నది. ఇక్కడ అకారానికి–ప్రకృతిశక్తి –అని, ధాతుశక్తి –అని రెండు శక్తులు గ్రహింపబడుతున్నాయి. ప్రకృతి అంటే– స్వభావం. అకారం యొక్క స్వభావం ఎటువంటిది? అంటే, **"అకర ముదల ఎழுత్తెల్లామ్"** (అక్షరాలన్నీ అకారాన్ని మూలంగా కల్గినవి) అనే రీతిలో సకలశబ్దాలకు తాను కారణమై ఉండడం అకారంయొక్క స్వభావం. ఈ స్వభావానికి తగిన స్వభావం భగవానునిపట్ల ఉన్నది. అది ఏమంటే– సమస్తజగత్తులకు తాను కారణభూతుడై ఉండడం.అందువల్ల ఈ స్వభావంలోని పోలికనుబట్టి సకలజగత్కారణభూతుడైన సర్వేశ్వరుడు అకారార్థభూతుడనబడుతున్నాడు. ఇక , ధాతుశక్తి ద్వారా సర్వరక్షకుడైన సర్వేశ్వరుడు–అనే అర్థం వ్యక్తమౌతుంది. ఏవిధంగా? అంటే, **"అవ–రక్షణే"** అనే రీతిలో రక్షణను అర్థంగా కల్గిన **"అవ"** అనే ధాతువుమూలంగా అకారం అనే పదం నిష్పన్నమౌతుంది. కనుక ఈ రెండు రీతులను ఉద్దేశించి **"జగదుదయరక్షాప్రళయకృత్ విష్ణుః – అకారార్థః"** అని శ్లోకంలో చెప్పబడింది. జగదుదయరక్షణలతో పాటు ప్రళయాన్ని కూడా చేర్చి చెప్పడానికి ఏమి కారణం? అంటే,– సృష్టి –స్థితి– లయాలకు కర్త–అని చెప్పినపుడే. సంహారానికి కూడా అతడే కర్త –అని అర్థాత్ సిద్ధిస్తుంది కనుక, **"యతో వా ఇమాని భూతాని జాయంతే"** (ఏ పరమాత్మ నుండి ఈ ప్రాణులన్నీ పుడుతున్నాయో) ఇత్యాది శ్రుతిలో సృష్టిస్థితి సంహారాలనే మూడింటినీ నిర్వహించడం పరబ్రహ్మ లక్షణంగా చెప్పబడినది కనుక.

ఇక, మకారార్థాన్ని **"మకారార్థో జీవః"** అనే ప్రయోగం తెల్పుతున్నది. **"మకారమ్–ఇరుపత్తఞ్జామ్ అక్షరమాయ్,జ్ఞానవాచియా యిరుక్కైయాతే ఆత్మావై చ్చొల్లుకిఱతు"** (మకారం – ఇరవై అయిదవ అక్షరమై, జ్ఞానవాచకమైనందున ఆత్మను నిర్దేశిస్తున్నది) అని ముముక్షుప్పడి గ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారన్నారు. అక్షరరాశిలోని (హల్ అక్షరాలలోని)ఒక్కొక్క అక్షరంద్వారా ఒక్కొక్క తత్త్వం నిర్దేశించబడుతున్నది. దీనిని తెలిపే క్రమంలో, కకారంమొదలు భకారంవరకు ఉండే ఇరవై నాల్గు అక్షరాలద్వారా **"పొఙ్గైమ్బులనుమ్ పొఱి యైన్దుమ్ కరుమేన్దిరియమ్ ఐమ్బూదమ్ ఇఙ్గు ఇవ్వుయిరేయ్ పిరకిరుది మానాఙ్గార మనఙ్గళే"** (పొంగే అయిదు భూతాలు, జ్ఞానేంద్రియాలు అయిదు) అని చెప్పబడే ఇరవై నాల్గు తత్త్వాలు



తెలుపబడ్డాయని, ఇరవై అయిదవ అక్షరమైన మకారం ఇరవై అయిదవ తత్త్వమైన జీవాత్మను తెల్పుతున్నదని చెప్పబడింది. అంతేకాక, మకారం **"మన–జ్ఞానే"** లేక, **"మను–అవబోధనే"** అనే ధాతువునుండి పుట్టినందున ఆత్మ జ్ఞానస్వరూపుడై, జ్ఞానాన్నే గుణంగా కలవాడై ఉంటాడని మకారం ద్వారా తెలుపబడుతున్నది. ఈరీతిలో ప్రణవంలోని అకార,మకారాల అర్థం తెలుపబడింది.

ఇక, **"తదుపకరణం వైష్ణవ మిదమ్"** అనే ప్రయోగం లుప్తచతుర్థియొక్క అర్థాన్ని తెల్పుతున్నది. (అకారం పై వచ్చి కోపించిన) లుప్తచతుర్థి అంటే ఏమి? అంటే – ఈ ప్రణవంలోని మొదటి అక్షరమైన అకారం పై చతుర్థీవిభక్తి వచ్చి, అది వైదిక ప్రక్రియకు చెందిన (**"సుపాం సులుక్"** అనే) ఒక సూత్రం ద్వారా లోపించిందని గ్రహించవలసిన ఆవశ్యకత ఉన్నది. ఏదో ఒక విభక్తి లేదంటే, ముందు వెనుక ఉండే పదాలు అన్వయించవు కనుక, ఏదో ఒక అర్థోచితమైన విభక్తి వచ్చి ఉండాలని, అది శాస్త్రానుసారం లోపించి ఉండాలని భావించాలి. విభక్తులు ఎన్నో ఉండగా, ఇక్కడ చతుర్థీవిభక్తియే వచ్చి లోపించింది – అని చెప్పవలసిన నియామకం ఏమున్నది? – అని అంటే, ఈ తిరుమంత్రంలో తర్వాత ఉండే నారాయణపదానికి ఈ అకారం సంగ్రహమని, ఈ అకారానికి నారాయణ పదం వివరణమనే క్రమం ఉన్నందున, వివరణాత్మకమైన నారాయణ పదంలో చతుర్థీవిభక్తి వ్యక్తంగా ఉండడం కన్పిస్తున్నందున, దాని సంగ్రహ రూపమైన అకారంపై కూడా ఆ చతుర్థీ విభక్తియే వచ్చి ఉండాలి – అని భావించడం యుక్తం. దానికి– (ఆ చతుర్థీవిభక్తికి)– శేషత్వం అర్థం. అకారవాచ్యుడైన భగవానునకు మకారవాచ్యుడైన జీవుడు శేషభూతుడని తెలుపబడింది.

**"తదుపకరణమ్ వైష్ణవమిదమ్"** అనే ఈ ప్రయోగానికి పలు రీతులలో అర్థనిర్వాహాన్ని చేస్తారు. **"తత్ ఇదమ్ వైష్ణవమ్ ఉపకరణమ్"** అనే అన్వయం సులభం. పూర్వం **"జీవః"** అని పుంలింగంతో నిర్దేశించి, వెంటనే ఇక్కడ **"తత్ ఇదమ్"** అని నపుంసక లింగంలో నిర్దేశించడం ఎందుకు? అంటే, ఈ ఆత్మవస్తువు అచేతన నిర్విశేషంగా (అచేతనం వలె) భగవానునకు శేషమై ఉన్నదని తెలుపడంకోసమే.

ఇక, ప్రణవంలోని మూడవ పదమైన ఉకారంయొక్క అర్థం వివరింప బడుతున్నది. ఈ ఉకారానికి అవధారణం అర్థం. **"ఏవ"** అనే పదానికి ఏ అర్థం చెప్పబడుతున్నదో, ఆ అర్థాన్నే ఉకారానికి గ్రహించాలి. ఇక్కడ **"మకారార్థో జీవః ఆయైవ"** అని అన్వయించి, చేతనుడు భగవానుడైన శ్రీమన్నారాయణునకు మాత్రమే శేషభూతుడు; ఇతరులెవ్వరికి శేషం కాదు–అని స్ఫుటపడుతున్నది. ఈవిధంగా

ఈశ్లోకంద్వారా ప్రణవార్థం వివరింపబడింది.

**2) మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసః స్వరూపం గతిః**
**గమ్యం శిక్షిత మీక్షితేన పురతః పశ్చాదపి స్థానతః ।**
**స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తిశ్చ నాన్యోచితా**
**తస్యైవేతి హరేః వివిచ్య కథితం స్వస్యాపి నార్హం తతః ॥**

చాలా గొప్ప మంత్రమైన అష్టాక్షరిలో మధ్యలో ఉండేది, తనకు ముందున్న ప్రణవంతో కలిపినది అయిన నమస్సుచే (నమఃశబ్దంచే) **"ఓమ్-నమః"** అనే రీతిలో జీవాత్మయొక్క అనన్యార్హశేషత్వమనే స్వరూపం నిష్కర్షింపబడింది. స్వస్థానంలోనే ఆవృత్తిని పొందిన నమశ్శబ్దంచే (**"నమో నమః"** - అనే క్రమంలో) ఉపాయం (జీవుని అనన్యశరణత్వం) నిష్కర్షింపబడింది. తనకు తరువాత గల నారాయణపదంతో చేరిన నమఃశబ్దంచే (**"నమో నారాయణాయ"** - అనే క్రమంలో) ఉపేయం (జీవుని అనన్య భోగ్యత్వం) నిష్కర్షింపబడింది. ఈవిధంగా శిక్షింపబడిన అర్థాలు ఏవి? అంటే - స్వతంత్రుడై ఉండే స్థితి, రక్షణ, శేషత్వానుగుణమైన కైంకర్యవృత్తి - అనే ఇవి హరిశబ్ద వాచ్యుడైన ఆ భగవానునకే తగినవి - అని, ఇక ఎవ్వరికి తగినవి కావు - అనే ఈ అర్థాలు వివరించి చెప్పబడ్డాయి. అందువల్ల, పూర్వం తెలుపబడిన మూడు - అంటే - స్వాతంత్ర్యం, తనను తాను రక్షించుకోవడం, శేషత్వాను గుణమైన కైంకర్యం (కైంకర్యాన్ని గ్రహించడం) అనే మూడు తనకు కూడా (జీవునకు కూడా) తగినవి కావు - అనే విషయంకూడా తేటతెల్లమవుతున్నది.

ఈశ్లోకం నమశ్శబ్దార్థాన్ని వివరిస్తున్నది. తిరుమంత్రంలో మధ్యలో ఉండే నమశ్శబ్దం సఖండనమస్సు - అని, అఖండనమస్సు - అని రెండు రీతులలో చెప్పబడు తున్నది. నమశ్శబ్దాన్ని **"న"** అని, **"మః"** అని విడదీస్తే అపుడు అది సఖండనమస్సు అనబడుతుంది. విడదీయకుండా ఒకే పదంగా గ్రహిస్తే అపుడది అఖండ నమస్సు అనబడుతుంది. విడదీసి గ్రహించేటపుడు, **"మః"** అనేది షష్ఠీవిభక్త్యంతరూపమైన మకారం కనుక, **"తనకు"** - అనే అర్థం దానికి గ్రహింపబడుతుంది. అందువల్ల దీనికి స్వార్థకత్వం స్ఫురిస్తున్నది. "నాకు నేను చెందినవాడను-శేషభూతుడను కాను" అని అర్థం - అని తెలుపబడినట్లు అవుతుంది. ఈ నమస్సు విరోధిని నిషేధిస్తున్నది. స్వరూపం-ఉపాయం-పురుషార్థం అనే మూడు జీవునకు శుద్ధమైనవిగా ఉండాలి.



ఈ మూడింటికి సంబంధించిన విరోధులున్నాయి. ఆ విరోధులను నిషేధించడమే నమశ్శబ్దంయొక్క పని. అందుచేత, స్వరూపవిరోధిని, ఉపాయవిరోధిని, పురుషార్థ విరోధిని నిషేధించి (తొలగించి), ఆ స్వరూప- ఉపాయ-పురుషార్థాలను మూడిటిని నమశ్శబ్దం శోధిస్తుంది - అని తెలుపబడినట్లయింది. పూర్వం ప్రణవం ద్వారా స్పష్ట పడిన (భగవదనన్యార్హ శేషత్వరూపమైన) జీవస్వరూపానికి ఏది విరోధియో, అది స్వరూపవిరోధి అనబడుతుంది. శేషత్వమనే స్వరూపానికి అహంకార-మమకారాలు విరోధి. భగవానుని హస్తావలంబాన్ని ఆశించడమనే ఉపాయానికి విరోధి ఏమంటే- తన రక్షణలో తాను అన్వయించడం. భగవత్కైంకర్యమనే ఉపేయానికి ఏది విరోధి? అంటే, అందులో స్వభోక్తృత్వ బుద్ధిని- అంటే- తాను భోక్తను అనే బుద్ధిని- కల్గి ఉండడం. ఈ విధంగా ఈ మూడు విరోధులను ఈ నమస్సు ఏ రీతిలో తొలగిస్తున్నది? అని అంటే, దానిని ఈ శ్లోకం చక్కగా నిరూపిస్తున్నది.

ఈ నమశ్శబ్దం అష్టాక్షరిలో నడుమన ఉన్నందున ముందున్న ప్రణవంతోను, తర్వాత ఉండే **"నారాయణాయ"** అనే పదంతో అన్వయించి, స్వస్థానంలో ఆవృత్తిని పొంది మూడు విరోధులను తొలగిస్తున్నది. ముందున్న ప్రణవంతో కలిసినపుడు **"ఓమ్ నమః"** అని, తరువాత గల పదంతో అన్వయించినపుడు **"నారాయణాయ నమః"** అని, స్వస్థానంలో ఆవృత్తిని పొందినపుడు **"నమో నమః"** అని అవుతుంది. సఖండ నమస్సు ప్రణవంలో అన్వయించి **"ఓమ్ నమః"** అని రూపొంది, **"మ్ ఆయైవ, మః న"** అని అవుతుంది. చేతనుడు (జీవుడు) భగవానునకే శేషభూతుడు; తనకు శేషం కాదు- అని అర్థం. ఈ రీతిలో స్వశేషత్వ నివృత్తి చేయబడినందున, స్వరూపం శోధింపబడినట్లయింది. **(స్థానత:)** స్వస్థానం లోనే ఆవృత్తిని పొందిన నమశ్శబ్దంచేత ఉపాయం శోధింపబడుతుంది. **"నమో నమ:"** అనే అన్వయంలో ముందున్న నమశ్శబ్దం అఖండనమస్సు; తర్వాత ఉన్నది సఖండనమస్సు. ఈ రెండిటిలో, అఖండ నమస్సు ఉపాయాన్ని తెల్పుతున్నది. ఉపాయంలో నాకు అన్వయం లేదనే అర్థం ఇక్కడ వ్యక్తమైనందున ఉపాయం శోధింపబడింది.

**(పశ్చాదపి)** నమస్సు తర్వాత ఉండే **"నారాయణాయ"** అనే పదంతో అన్వయాన్ని పొందిన (సఖండ) నమస్సు ఉపేయాన్ని- అంటే-ఫలాన్ని-శోధిస్తున్నది. అది ఏవిధంగా? అంటే, సర్వశేషి అయిన శ్రీమన్నారాయణుని అనందం కోసమే కైంకర్యాన్ని చేస్తున్నాను; నా ఆనందం కోసం కాదు- అనే అర్థం స్ఫురింపజేసి, కైంకర్యంలో

స్వార్థతాబుద్ధిని పోగొడుతున్నది. ఈ రీతిలో శిక్షింపబడినందున తెలుపబడిన ఫలాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధంలో తెల్పుతున్నది.

**(స్వాతంత్ర్యం తస్యైవ హరేః)** ఇది **"ఓమ్ నమః"** అనే అన్వయంద్వారా వ్యక్తమైన అర్థం. పారతంత్ర్యం తెలుపబడిందని భావం.

**(నిజరక్షణం తస్యైవ)** – నా రక్షణం కూడా స్వామిదే; నాది కాదు. ఇది **"నమో నమః"** అనే అన్వయం ద్వారా స్ఫుటపడుతున్నది .

**(సముచితా వృత్తిశ్చ నాన్యోచితా)** – స్వరూప ప్రాప్తమైన కైంకర్యం ఆ భగవానుని ఆనందంకోసమే, నా ఆనందంకోసం కాదు. ఇది **"నారాయణాయ నమ:"** అనే అన్వయం ద్వారా స్ఫుటపడుతున్నది.

**(తతః స్వస్యాపి నార్హమ్)** – పూర్వం పల్కిన స్వాతంత్ర్యం మొదలైన మూడు మనకు భగవానునకు, మనకు కూడా– అనే రీతిలో ఉభయసాధారణం కాదు– అని అర్థం.

**(ఇతి వివిచ్య కథితమ్)** – ఈవిధంగా వివరించి చెప్పబడింది – అని శ్లోకాన్ని ముగించాలి.

3 ) **అకారార్థాయైవ స్వమహ మథ మహ్యం న నివహాః**
**నరాణాం నిత్యానా మయనమితి నారాయణపదమ్ ।**
**యమాహాస్మై కాలం సకలమపి సర్వత్ర సకలాసు**
**అవస్థాసు ఆవిఃస్యుః మమ సహజకైంకర్యవిధయః ।।**

మకారంచేత తెలుపబడే నేను (జీవుడు) అకారంచేత చెప్పబడే నారాయణునకే శేషభూతుడను (ఇది ప్రణవార్థం). ఆ పిమ్మట, నేను నాకు శేషభూతుడను కాను (ఇది నమఃశబ్దార్థం). నారాయణపదం – నిత్య వస్తువుల సమూహానికి ఆధారమైన వాడు – నారాయణుడు అని (తత్పురుషసమాసం ద్వారా), అనిత్యవస్తుసమూహాన్ని తనకు ఆధారంగా కలవాడు – నారాయణుడు అని (బహువ్రీహిసమాసంవల్ల) ఏ భగవానుని తెల్పుతున్నదో, ఆ భగవానునకు అన్ని సమయాలలోను సర్వత్ర అన్ని విధాలైన అవస్థలలోను నేను సహజమైన కైంకర్యాలను చేసేవాడను కావాలి (ఇది **"నారాయణాయ"** అనే పదం యొక్క అర్థం.)



ఈ శ్లోకంలో తిరుమంత్రంలోని మూడుపదాల అర్థాన్ని సంగ్రహించి స్వానుభవముఖంగా భట్టర్ వ్యక్తం చేస్తున్నారు.

**(అకారార్థాయైవ స్వ మహమ్)** – అహంశబ్దవాచ్యుడైన జీవుడు అకారశబ్ద వాచ్యుడైన భగవానునికొఱకే ఉన్నాడు – అని అర్థం. ఈసూక్తి ప్రణవంలోని అర్థాన్ని సారరూపంగా తెల్పుతున్నది. అకారం, లుప్తచతుర్థి, ఉకారం, మకారం– అనే నాల్గింటి అర్థాన్ని క్రమేణ ప్రతిపాదించిన తీరును గమనించండి.

**(మహ్యం న)** – ఇది నమ:పదంయొక్క అర్థాన్ని తెల్పుతున్నది. నేను నాకోసం కాదని అర్థం. ఇక **"నివహాః"** అని మొదలు **"యమాహ"** అనే పర్యంతం నారాయణ శబ్దార్థం తెలుపబడుతున్నది. నారాయణ శబ్దానికి తత్పురుషసమాసం ద్వారా, బహువ్రీహి సమాసం ద్వారా రెండు వ్యుత్పత్తులను చెప్పవచ్చు. ముముక్షుప్పడిలో **"నారాయణ నెన్గదు – నారజ్గళుక్కు అయనమెన్దపడి"** (నారాయణుడంటే– నారాలకు ఆశ్రయమని అర్థం) అనే చూర్ణికలో తత్పురుషసమాసాన్ని చూసి, ఆ తరువాత **"అజ్గనన్రిక్కే– తన్నై ఆశ్రయమాక ఉడైయవనెన్నవుమామ్"** (అంతేకాక, నారాలను ఆశ్రయంగా కలవాడని కూడా అర్థం) అనే చూర్ణికలో బహువ్రీహిసమాసాన్నికూడా చూపిన వైనం ఇక్కడ అనుసంధేయం. ఆ రెండు సమాసాలను ఇక్కడ సంగ్రహంగా చూపుతున్నారు. తత్పురుష సమాసాన్ని చెప్పేటపుడు మూలంలో (శ్లోకంలో) **"తేషామ్"** అనే పదాన్ని కలుపు కోవాలి. బహువ్రీహి సమాసాన్ని చెప్పేటపుడు **"యస్య"** అనే పదాన్ని కలుపుకోవాలి.

**"ర"** అనే పదం నశించే స్వభావాన్ని కల అర్థాన్ని (వస్తువును) తెల్పుతుంది. **"నర"** అనే పదం నశించని వస్తువును తెల్పుతుంది. **"నార"** అనే పదం నిత్యవస్తువుల సమూహాన్ని తెల్పుతుంది. సమూహార్థంలో అణ్ ప్రత్యయం, ఆదివృద్ధి వచ్చింది. ఆపైన బహువచనంకూడా రాగా, నిత్య వస్తువుల సమూహాలు అనేకం– అనే అర్థాన్ని **"నారా:"** అనే పదం ఇస్తుంది. వీటికి ఆశ్రయంగా ఉండేవాడు నారాయణుడు– అని తాత్పర్యం. ఉభయవిభూతులలోని అన్ని వస్తువులకు నారాయణుడు ఆధారభూతుడని (**"నారాణామ్ అయనమ్ యః సః"** అనే తత్పురుష సమాసవ్యుత్పత్తి ద్వారా) తెలుపబడినట్లయినది.

ఉభయవిభూతులలోని అన్ని వస్తువులు నశించని వస్తువులా? అనిత్య వస్తువులేవీ లేవా? – అని అంటే, అనిత్యవస్తువులనేవి ఏమీ లేవు. అన్నీ నిత్యవస్తువులే. స్వరూపత:

నిత్యాలని, ప్రవాహత: నిత్యాలని  నిత్యవస్తువులు రెండు విధాలు. ఏనాటికీ ఉత్పత్తి వినాశాలు లేని వస్తువులు స్వరూపత: నిత్యాలు. ఉత్పత్తి వినాశాలున్నా, ముందున్న నామరూపలింగాదులు మాఱకుండా ఉండే వస్తువులు ప్రవాహనిత్యాలు. ఈ రీతిలో ఇటువంటి సకలపదార్థాలకు ఆశ్రయమైనవాడు నారాయణుడు– అనే అర్థం తత్పురుష సమాసం ద్వారా వ్యక్తమైనది.

నారాలను ఆశ్రయంగా కలవాడు – అనే అర్థం బహువ్రీహి సమాసం ద్వారా వస్తుంది. సర్వ వస్తువులు భగవానునిలో ఉన్నాయి–అని, అన్ని వస్తువులలోను భగవానుడున్నాడని–ఈ తత్పురుష, బహువ్రీహి సమాసాలనే రెంటి ద్వారా వ్యక్తమౌతున్నది. ఈవిధంగా నారాయణపదార్థాన్ని గూర్చి పల్కి, **"అస్మై కాలం సకలమపి"** –అని ఆరంభించి శ్లోకంలోని మిగిలిన భాగంలో నారాయణపదంపై ఉండే చతుర్థీ విభక్తి యొక్క అర్థాన్ని నిరూపిస్తున్నారు. **"ఒ*ழి*విల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వ*ழு*విలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** (విచ్ఛేదం లేని కాలం అంతా వెంటనే ఉండి నిరంతరమైన సర్వవిధ కైంకర్యాన్ని మనం చేయాలి) అనే రీతిలోనే సర్వదేశ– సర్వకాల–సర్వావస్థలలోను కైంకర్యం అనువర్తించాలనే ప్రార్థన ఈ చతుర్థీవిభక్తియొక్క అర్థం – అని భావం. **"కాలం సకలమపి"**అనే చోట ఉండే ద్వితీయా విభక్తి **"కాలాధ్వనో రత్యంతసంయోగే ద్వితీయా"** అనే పాణిని సూత్రంద్వారా వచ్చింది. నిరంతరంగా, ఏ కొంచెం సమయం కూడా విడువకుండా– అని దీని తాత్పర్యం.

**4) దేహాసక్తాత్మబుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యాత్ తృతీయం**
**స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమ మితరశేషత్వధీశ్చేత్ ద్వితీయమ్ ।**
**ఆత్మత్రాణోన్ముఖశ్చేత్ నమ ఇతి చ పదం బాంధవాభాసలోలః**
**శబ్దం నారాయణాఖ్యం విషయచపలధీశ్చేత్ చతుర్థీం ప్రపన్నః ॥**

ప్రపన్నుడు, దేహంపట్ల ఆత్మబుద్ధిని కలవాడైతే (దేహాత్మభ్రాంతిని కలవాడైతే), ప్రణవంలోని మూడవ పదమైన మకారాన్ని బాగా గమనించాలి. స్వస్వాతంత్ర్య భ్రమను– నేను స్వతంత్రుడను – అనే భ్రమను – అనే కలవాడైతే, మొదటి పదమైన (లుప్త చతుర్థీవిభక్తితో కూడిన) అకారాన్ని గమనించాలి. అన్యశేషత్వభ్రమను–



ఇతరులకు నేను శేషమనే భ్రమను – కలవాడైతే, ప్రణవంలోని రెండవ పదమైన ఉకారాన్ని గమనించాలి. స్వరక్షణలో తనకు బాధ్యత ఉన్నదనే భావనను కలవాడైతే, **"నమః"** అనే – అష్టాక్షరిలోని మధ్యమపదాన్ని గమనించాలి. భగవానునికంటే ఇంకొకరు తనకు బంధువులనే భావన కల్గి ఉంటే – ఆభాసబంధువులపట్ల ఆసక్తిని కల్గిఉంటే, నారాయణశబ్దాన్ని గమనించాలి. లౌకికవిషయాలపట్ల చాపల్యాన్ని కలవాడైతే, నారాయణపదంపై గల చతుర్థీ విభక్తిని గమనించాలి.

తిరుమంత్రం, శబ్దశక్తి ద్వారా, అర్థశక్తి ద్వారా– రెండు రీతులలోను రక్షించగలదు. తిరుమంత్రంతో జపం చేసి, హోమం చేసి కార్యాలను సాధించాలని చూచే ఉపాసకులు పొందే రక్షణం అనేది శబ్దశక్తి ద్వారా పొందే రక్షణం. భగవానుడే ఉపాయం, ఉపేయం – అని నమ్మి ఉండే ప్రపన్నులు పొందే రక్షణం అనేది అర్థశక్తి (జ్ఞానం)ద్వారా కలిగే రక్షణం. రెండవది అయిన అర్థశక్తి ద్వారా కలిగే రక్షణాన్నిగూర్చి ఈ శ్లోకంలో భట్టర్ పల్కుతున్నారు.

దీని భావమేమంటే– దేహమే ఆత్మ –అని ఎవడైనా భ్రమిస్తే, అతడు ప్రణవంలోని మూడవ పదమైన మకారాన్ని గమనించాలి. మకార మనేది జ్ఞానాన్ని కల ఆత్మని తెల్పున్నందున, జ్ఞానశూన్యమైన దేహం ఆత్మ కాబోదు – అని దీనివల్ల తెలియవచ్చు.

ఇక, దేహంకంటే వేఱయినవాడు ఆత్మ– అని గ్రహించినా, ఆ ఆత్మ స్వతంత్రుడే తప్ప ఎవరికీ పరతంత్రుడు కాడు – అనే భ్రమను పొందవచ్చు. కనుక, అటువంటి భ్రమ కల్గితే, అపుడు మొదటి పదమైన అకారాన్ని గమనించాలి. చతుర్థీవిభక్తి వచ్చి లోపించిన ఆ అకారం **"జీవాత్మ పరమాత్మకు శేషభూతం"** అనే అర్థాన్ని తెల్పుతున్నందున, జీవాత్మ పరతంత్రుడే తప్ప, స్వతంత్రుడు కాడు– అని దీని వల్ల తెలియవచ్చు.

ఇక, జీవుడు భగవానునకు శేషభూతుడై ఉన్నప్పటికీ, అతనికి శేషమై ఉండేటట్లే, ఇతరులకుకూడా శేషంగా ఉండవచ్చు కనుక, లోకంలో ఒకడు ఎవరికో ఒకనికి మాత్రమే శేషంగా ఉండడమనే నియమం కన్పించడం లేదు కనుక, భగవానునకు శేషభూతుడై ఉండడంతో పాటు, ఇతరులకు కూడా శేషంగా ఉండవచ్చుననే భ్రమ కల్గితే, అపుడు రెండవ పదమైన ఉకారాన్ని గమనించాలి. ఈ ఉకారం అవధారణార్థాన్ని (అంటే– ఏవకారార్థాన్ని) తెల్పుతున్నదై, "జీవుడు భగవానునకే చెందినవాడు" అనే అర్థాన్ని తెల్పుతున్నది కనుక, అన్యశేషత్వ భ్రమం (ఇతరులకు శేషమనే భ్రమ) దీనివల్ల

తొలగిపోయింది.

ఇక, ఇతరులకు కూడా శేషభూతుడై ఉండడం కాకుండా, భగవానునకే శేషభూతుడై ఉన్నా, తనకు రక్షించుకొనే విషయంలో తానే ప్రయత్నం చేసికోవచ్చు కదా! – అని భావిస్తే (భ్రమిస్తే) **"నమః"** అనే పదాన్ని గమనించాలి. తనకు రక్షించు కోవడంలో తనకు అన్వయం లేని స్థితిని ఆ **"నమః"** అనే పదం తెల్పుతున్నందున, మనలను రక్షించే బాధ్యత భగవానునిదే– అనే నిశ్చయం దీనివల్ల కల్గుతుంది.

ఇక, **"కొణ్డ పెణ్డిర్ మక్కళ్ ఉ*ఱ్ఱా*ర్ శు*ఱ్ఱ*త్తవర్ పిఱరుమ్"** (స్వీకరించిన కాంతలు, సంతానం, ఆత్మీయులు, బంధువులు, ఇతరులు) అనే రీతిలో ఆభాస బంధువులపట్ల బంధుత్వభావన ఉంటే, నారాయణ పదాన్ని గమనించాలి. ముముక్షుప్పడిలో **"ఎమ్బిరాన్ ఎన్దై– ఎన్దైయాలే ఈశ్వరనే ఎల్లా ఉఱవు ముఱైయు మెన్ఱు శొల్లుమ్.నామ్ పిఱర్క్కాక వన్దుమ్ అవన్ నమక్కా యిరుక్కుమ్. ఇరామడ మూట్టువారైప్పోలే ఉళ్ళే పది కిడన్దు సత్తైయే పిడిత్తు నోక్కిక్కొణ్డుపోరుమ్"** ("ఎమ్బిరాన్ ఎన్దై" – అని అనడంవల్ల ఈశ్వరుడే సర్వవిధబంధువని తెలుపబడింది. మనం ఇతరుల కోసంగా ఉండేటపుడు కూడా, అతడు మన కోసం ఉంటాడు. రాత్రివేళలో తల్లి అవిధేయుడైన తన పుత్రునకు రహస్యంగా భోజనం పెట్టినట్లుగా మనలోపల స్థిరంగా ఉండి, మనసత్తను రక్షిస్తాడు.) అని పల్కిన శ్రీసూక్తి ఇక్కడ స్మరణీయం. నారాయణ పదంలోని **"అయన"** పదానికి కరణే వ్యుత్పత్తి, కర్మణి వ్యుత్పత్తి అనే రెండు వ్యుత్పత్తులు శాస్త్రసిద్ధాలు. **"ఈయతే అసౌ ఇత్యయనమ్"** అనే వ్యుత్పత్తి కర్మణి వ్యుత్పత్తి. దీని ద్వారా భగవానుని ఉపేయత్వం తెలుపబడింది. ఆ ఉపేయానికి సంకోచం లేనందున అది **"తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మ*ఱ్ఱు*మాయ్ ము*ఱ్ఱు*మాయ్"** (తల్లియై, తండ్రియై, సంతానమై, ఇంకా సర్వవిధబంధువై) అనే రీతిలో మాతృత్వం మొదలైన సర్వప్రకారవిశిష్టమై ఉన్నందున, బంధులాభంకూడా ప్రాప్యమే కనుక, భగవానుడు సర్వవిధ బంధువు–అనేది నారాయణపదంద్వారా సిద్ధం. అందువల్లనే ఈ నారాయణ నామంయొక్క అర్థాన్ని అనుసంధించే తిరుమంగై ఆళ్వార్లు – **"ఎమ్బిరాన్ ఎన్దై ఎన్నుడై చ్చు*ఱ్ఱ*మ్ ఎనక్కరశు ఎన్నుడై వాణాళ్"** (నాకు ఉపకారకుడు, తండ్రి, నాకు బంధువు, నాస్వామి, నాజీవితం) అని అంటూ సకలవిధబంధుత్వాన్ని (నారాయణ శబ్దార్థంగా) పలికారు.అందువల్లనే ఆభాసబంధువుల పట్ల సంబంధం కల్గి ఉంటే, నారాయణ పదాన్ని గమనించాలి– అని అనడం పొసగుతుంది.



ఇక, క్షుద్రవిషయాలలో ఆసక్తి ఉన్నట్లయితే నారాయణ పదంపైన ఉండే చతుర్థీవిభక్తిని గమనించాలి. దానివల్ల నారాయణునకు ఒక్కనికి మాత్రమే అన్ని విధాల కైంకర్యాలు చేయగలిగేవాడనుగా నేను కావాలి – అని అపేక్షిస్తున్నందున లౌకిక విషయప్రావణ్యానికి అవకాశం అనేది ఉండదు.

## ద్వయమంత్రార్థం

**5) నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనం చ**
**ఉపాయం కర్తవ్యభాగం త్వథ మిథునపరం ప్రాప్య మేవం ప్రసిద్ధమ్।**
**స్వామిత్వం ప్రార్థనాం చ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాన్**
**మంతారం త్రాయతే చేత్ అధిగతనిగమః షట్పదోఽయం ద్విఖండః॥**

లక్ష్మీపురుషకారత్వం (శ్రీశబ్దార్థం), ఆమె ఒక క్షణం అయినా స్వామి విడచి ఉండని నిత్యసంశ్లేషం (మతుప్ ప్రత్యయార్థం), ఆశ్రయణానికి తగిన భగవానుని కల్యాణగుణాల సమూహం (నారాయణశబ్దార్థం), భగవానుని తిరుమేనిని తెలియ జేయడం ("చరణౌ" శబ్దార్థం), భగవానుని ఉపాయత్వం (శరణ శబ్దార్థం), చేతనుడు కల్గి ఉండవలసిన అధ్యవసాయం (**"ప్రపద్యే"** శబ్దార్థం), దివ్యదంపతులను ఇరువురిని ఉద్దేశించి ప్రపన్నుడు చేసే కైంకర్యం (ఉత్తర వాక్యంలోని శ్రీమచ్ఛబ్దార్థం), స్వామిత్వం (ఉత్తరవాక్యంలోని నారాయణ శబ్దార్థం), కైంకర్యప్రార్థన (ఉత్తరవాక్యంలోని నారాయణశబ్దంపై గల చతుర్థీవిభక్తియొక్క అర్థం). మిక్కిలి ప్రబలమైన ఉపేయ విరోధిని తొలగించడం (ఉత్తర వాక్యం చివరగల నమశ్శబ్దార్థం) అనే పది అర్థాలను తెల్పుతూ, రెండు ఖండాలను కల్గినది, ఆఱు పదాలను కల్గినది అయిన ఈ ద్వయ మంత్రం అనుసంధించే ఉత్తమాధికారిని కాపాడుతున్నది–అనే ఈ విషయం ప్రసిద్ధం.

ద్వయంలో ఉండే ఒక్కొక్క పదాన్ని దృష్టిలో పెట్టుకొని వాటి అర్థాలను ఈ శ్లోకంలో పల్కుతున్నారు. **"శ్రీ,మత్, నారాయణ, చరణౌ, శరణం, ప్రపద్యే, శ్రీమతే, నారాయణ, ఆయ, నమః"–** అనే ఈ పది పదాలు ద్వయ మంత్రంలో ఉన్నందున, క్రమానుసారంగా ఒక్కొక్క పదానికి ఒక్కొక్క అర్థం చొప్పున పది అర్థాలను ఈ శ్లోకంలో భట్టర్ తెల్పుతున్నారు.

**(నేతృత్వమ్)** – ఇది శ్రీ శబ్దార్థం.పురుషకారత్వం దీని అర్థం. ఇది **"ణీఞ్–ప్రాపణే"**

అనే ధాతురూపంనుండి పుట్టిన పదం కనుక, చేతనులను భగవానుని ప్రార్థించేటట్లు చేయడమే నేతృత్వమనబడుతుంది. అంటే-పురుషకారమని తాత్పర్యం. శ్రీశబ్దంనుండి ఇది ఏవిధంగా లభిస్తున్నది? అని అంటే, శ్రీశబ్దానికి ఆఱు రీతులలో వ్యుత్పత్తులున్నాయి. **శ్రీయతే, శ్రయతే, శ్రుణోతి, శ్రావయతి, శృణాతి, శ్రీణాతి**- అనేవి ఆ ఆఱు వ్యుత్పత్తులు. ఈ ఆఱు వ్యుత్పత్తులవల్ల శ్రీమహాలక్ష్మియొక్క పురుషకారత్వం స్పష్టపడుతుంది. ఇక్కడ మొదటి రెండు వ్యుత్పత్తులను మాత్రం గ్రహిస్తే చాలు. **"శ్రీయతే"** కర్మణి వ్యుత్పత్తిద్వారా అందఱిచే ఆశ్రయింపబడేది-అనే అర్థం స్ఫుటపడుతున్నది. భగవానుడు మనలను అనుగ్రహించేటట్లుగా నీవు చేయాలి- అనే ప్రార్థనతో చేతనులచే ఆశ్రయింపబడేది- అని తాత్పర్యం. ఇక, **"శ్రయతే"** అనే కర్తరి వ్యుత్పత్తిలో భగవానుని ఈమె ఆశ్రయిస్తున్నది- అనే అర్థం వ్యక్తమవుతున్నది. తనను ఆశ్రయించినవారైన చేతనులను భగవానుడు అంగీకరించడంకోసం భగవానునితో వాదించేది- అని భావం. అందువల్ల ఈ రీతిలో శ్రీ శబ్దానికి పురుషకారత్వం అర్థమని చెప్పబడినట్లయింది.

**(నిత్యయోగమ్)** - ఇది శ్రీశబ్దంపై వచ్చిన **"మతుప్"** ప్రత్యయంయొక్క అర్థం. "ఎల్లప్పుడు స్వామితో కూడిఉండేది (నిత్యయోగమ్) అనే అర్థంలో ఈ మతుప్‌ప్రత్యయం వచ్చిందని గ్రహించాలి. దీనివల్ల పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మి, ఈశ్వరుడు - అనే ఇద్దరి చేరిక ఎల్లప్పుడు ఉన్నది- అనే విషయం తెలుపబడి నట్లయినది. అపరాధాలను లెక్కించి దండించే భగవానుని స్వాతంత్ర్యాన్ని, చేతనుడు చేసే అపరాధాల ఆనంత్యాన్ని చూచి, "అయ్యో! ఏమి అవుతుందో?" అనే భయంతో భగవానుని విడచి ఒక్క క్షణం కూడా లక్ష్మీదేవి విశ్లేషించదు- అని భావం.

**(సముచితగుణజాతమ్)** ఇది నారాయణ శబ్దార్థాన్ని వివరిస్తున్నది. నారాయణుడు- అనే దానికి పలు పలు అర్థాలున్నాయి. అక్కడక్కడ ఆయా సందర్భాలకు అనుగుణంగా అర్థం గ్రహించాలి. ఇక్కడ-వాత్సల్యం, స్వామిత్వం, సౌశీల్యం, సౌలభ్యం, జ్ఞానం, శక్తి- అనే ఈ కల్యాణగుణాలను కలవాడు- అనే అర్థాన్ని గ్రహించాలి. ఎందుకంటే- ఆశ్రయించాలనే రుచిని కల చేతనుడు, అనాదికాలంగా చేసిన అపరాధాలను చూచి, కోపించి, ఇతనిని అంగీకరించను-అని తలచే భగవానుని స్వాతంత్ర్యం, (లక్ష్మీదేవి) తన ఉపదేశంతోను, అందంతోను వశీకరించుకొని, కార్యాన్ని సఫలం చేయగల తన పురుషకారబలంలో తల వంచిన పిదప, అంతకు ముందే ఆ స్వాతంత్ర్యం అడుగున



అణగి ఉండే, (ఇపుడు ఆ స్వాతంత్ర్యం తల వంచినందున) తల ఎత్తే గుణాలు ఇవే కనుక, ఈ గుణాలు ఇక్కడ నారాయణ శబ్దానికి అర్థంగా గ్రహించదగినవి.

ఈ గుణాలకు ప్రకృతంలో ఏమి ఉపయోగం? అని అంటే,ఆశ్రయించగోరిన చేతనుడు తన దోషాలను చూచి,భయపడకుండా ఉండడానికి వాత్సల్యం పనికి వస్తుంది. "మన కార్యాన్ని సఫలం చేస్తాడో? చేయడో?" -అని సంశయించకుండా, కలవరపడకుండా, "తప్పక చేస్తాడు" అని విశ్వసించడానికి స్వామిత్వం పనికి వస్తుంది. ఉభయ విభూతులకు స్వామియై ఉండే గొప్పతనానికి ప్రకాశకమైన స్వామిత్వాన్ని చూచి, జీవుడు తన నైచ్యాన్ని అనుసంధించి, తొలగిపోకుండా ఉండడానికి సౌశీల్యం పనికి వస్తుంది. అతీంద్రియుడు (కంటికి కన్పించనివాడు)- అని వెనుకంజ వేయకుండా, కంటితో దర్శించి ఆశ్రయించడానికి సౌశీల్యం పనికి వస్తుంది. ప్రాప్తివిరోధులను పోగొట్టి, ప్రాప్యుడైన తనను లభించేటట్లు జ్ఞాన శక్తులు చేస్తాయి. ఈ రీతిలోని ఈ కళ్యాణగుణాలు నారాయణ శబ్దార్థంగా ఇక్కడ అనుసంధేయాలని తాత్పర్యం.

**(తనుఖ్యాపనమ్)** "నారాయణుని శ్రీచరణాలను ఆశ్రయిస్తున్నాను" అని మూలంలో (ద్వయ మంత్రంలో) ఉన్నా, శ్రీచరణాలను మాత్రం ఇక్కడ చెప్పడం ద్వారా తిరుమేని ఉపలక్షింపబడుతున్నదని గ్రహించాలి. తిరుమేని లోని ఒక భాగమైన శ్రీచరణాలను చెప్పినపుడే పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవికి నివాస స్థానమై,నారాయణ పదంలో చెప్పబడిన గుణాలకు ప్రకాశకమైన దివ్యమంగళరూపం తెలుపబడినట్లయినది కదా!

**(ఉపాయమ్)** - ద్వయంలోని మొదటి పదమైన **"శ్రీమన్నారాయణ చరణౌ"** అనే పర్యంతం గల అర్థం. ఇంత వరకు చెప్పబడింది. ఇపుడు, రెండవ పదమైన **"చరణ"** మనే పదానికి అర్థం చెప్పబడుతున్నది.. ఇష్టప్రాప్తికి, అనిష్టనివృత్తికి తప్పని ఉపాయంగా-అనేది చరణ శబ్దార్థమని తెలుపబడింది.

**(కర్తవ్యభాగమ్)** - ద్వయంలోని **"ప్రపద్యే"** అనే ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రయోగాన్ని పల్కుతున్నాను. **"ప్రపద్యే"** అనే పదానికి - ఆశ్రయిస్తున్నాను- అని అర్థం. **"రక్షించాలి"** అని నోటితో ప్రార్థించడమనేది కేవలవాచికంగాను, చేతులను జోడించి అంజలిని చేస్తూ నమస్కరించడం మొదలైన కేవల కాయికంగాను

ఆశ్రయించినా ఫలం సిద్ధించడంలో లోటు లేదు. అయినా, **"తత్త్వజ్ఞానాన్ముక్తిః"** అని జ్ఞానంద్వారా మోక్షం కల్గుతుందని చెప్పబడడంచేత, ఇక్కడ మానసికమైన ఆశ్రయణమే చెప్పబడింది– అనేది ఆచార్యుల అభిప్రాయం. భగవానుని రక్షకత్వాన్ని అగీకరించడ మనే ఒక అధ్యవసాయమే ఈ జ్ఞానం. అదే కర్తవ్యమని తెలుపబడినట్లు అయినది. వాచిక–కాయిక–మానసికాలనే మూడింటిలో ఇదొక భాగం కనుక **"కర్తవ్యభాగమ్"** అని అనబడింది.

ఈ రీతిలో ఇంతవరకు ద్వయం పూర్వఖండంలోని అర్థం చెప్పబడింది. ఇక ఉత్తరఖండంలోని అర్థాన్ని తెలుపడం ఆరంభించిన క్రమాన్ని **"అథ"**అనే ఆనంతర్యార్థక పదాన్ని ప్రయోగిస్తూ సూచించారు.

**(మిథునపరం ప్రాప్యమ్)** – భగవానుడు, పిరాట్టి– అనే ఇద్దఱు కలసి ఉండే సన్నివేశంలో కైంకర్యం చేయాలని ప్రార్థించడమే ఉత్తరవాక్యంలోని సారార్థం. పూర్వవాక్యాన్ని వివరించేటపుడు శ్రీశబ్దానికి చూపిన రెండు వ్యుత్పత్తుల అర్థం, మతుప్ ప్రత్యయానికి అర్థమైన నిత్యయోగం అదే రీతిలో అనుసంధేయం. అందువల్ల **"శ్రీమతే"** అనే పదానికి – లక్ష్మీదేవితో కూడి ఉండేవాని కోసం– అని అర్థం. పిరాట్టి యొక్క నిత్యయోగాన్ని అనుసంధించడం రెండుచోట్ల ఒకే విధంగా ఉన్నా, ఆ యా సన్నివేశా లకు తగిన రీతిలో ఈమె ఉండే స్థితులను నిష్కర్షించి గ్రహించాలి. పూర్వవాక్యంలో అనుసంధించిన నిత్యయోగం పురుషకారత్వంకోసం. ఇపుడు ఉత్తర వాక్యంలో అనుసంధించే నిత్యయోగం–కైంకర్య ప్రతిసంబంధిత్వేన అన్వయం భగవానునకు ఉన్నట్లే, లక్ష్మీదేవి కూడా ఉన్నదని తెలుపడంకోసం. అందువల్ల చేతనుడు చేసే కైంకర్యానికి ఉద్దేశ్యం మిథునమే– అని తెలుపబడినట్లయినది.

**(స్వామిత్వమ్)** – ఇది నారాయణ శబ్దార్థం. ఇక్కడ నారాయణత్వమంటే – ఉభయవిభూతినాథత్వం కనుక, సర్వస్వామియై ఉండేవానికి – అని అర్థం. ఇది కైంకర్యప్రార్థనను చేసే సందర్భం కనుక ఈ అర్థమే పొసగుతుంది. స్వామిత్వ సంబంధాన్ని కల్గినవాడేకదా కైంకర్య ప్రతిసంబంధికాగలడు. అప్రాప్తవిషయంలో చేసే కైంకర్యం రుచించదు కదా.

**(ప్రార్థనామ్)** – ఇది నారాయణ పదం పై ఉండే చతుర్థీ విభక్తియొక్క అర్థం. సర్వదేశ –సర్వకాల –సర్వావస్థలకు తగిన సకలవిధకైంకర్యాలను చేయాలి– అనే ప్రార్థనను ఈ చతుర్థీ విభక్తి తెల్పుతున్నది. శేషత్వజ్ఞానకార్యమైన ఉపాయపరిగ్రహణానికి తర్వాత ఉండే ఈ చతుర్థి– జీవుడు, తాను పరిగ్రహించిన ఉపాయంయొక్క ఫలమైన కైంకర్యాన్ని ప్రార్థించిన రీతిని తెలుపుతున్నదని అనడమే సమంజసం.



**(ప్రబలతరవిరోధిప్రహాణమ్)** – ఇది **"నమః"** అనే పదంయొక్క అర్థాన్ని తెల్పుతున్నది. నమశ్శబ్దం సామాన్యంగా అహంకార మమకారాలను నిషేధిస్తుంది కనుక, తిరుమంత్రంలో మధ్యన ఉండే నమస్సువలె స్వరూప విరోధి, ఉపాయవిరోధి, పురుషార్థ విరోధి – అనే మూడిటిని నిషేధించగల్గినదే అయినా, ఇక్కడ సందర్భాను సారంగా ఆ రీతిలో కాకుండా, ఈ నమశ్శబ్దం కైంకర్యప్రార్థనకు పిమ్మట ఉన్నది కనుక, ఈ కైంకర్యంలోని విరోధిని నిషేధిస్తున్నది. కైంకర్యాన్ని తన ఆనందానికి అనువుగా భావించి చేయడమే ఇక్కడ విరోధి. ఆరీతిలో భావించి కైంకర్యం చేయకూడదు. "భగవన్ముఖ వికాసహేతువు కనుక, ఇది మనకు ఆదరించదగినది" అనే భావననే కల్గి ఉండాలి. ఇందులో, తాను భోక్త – అనే బుద్ధిని,తన భోగం ఇది–అనే బుద్ధిని కల్గి ఉంటే, అది పురుషార్థం కాబోదు. దాని **"ప్రహాణమ్"**– అంటే నిషేధం. అనే నమశ్శబ్దార్థం– అని తెలుపబడింది. ఈ రీతిలో ఈ పది అర్థాలు ద్వయంలో అనుసంధేయాలు– అని ఈ శ్లోకంద్వారా తెలుపబడింది.

**"దశైతాన్"** అనే చోట **"దశార్థాన్"** అనేది కొందఱి పాఠం. ఈ విధంగా ఈ పది అర్థాలను – **(మంతారం త్రాయతే)** మననం చేసే భక్తవర్గాన్ని శబ్దశక్తితో, అర్థశక్తితో ఈ ద్వయ మనబడే మంత్రరత్నం రక్షిస్తుంది. **"అధిగత నిగమః"** అనేది పూర్వుల పాఠం. కఠవల్లి– అనే శ్రుతిలో ఈ ద్వయమంత్రం పఠింపబడిందని అర్థం. **"అధిగతనియమః"** అనేది కొందఱి పాఠాంతరం.

**(షట్పదః)** – ఇందులో మొదటి పదాన్ని **"శ్రీమన్, నారాయణ, చరణౌ"** అని మూడు పదాలుగా విభజించడం, **"శ్రీమన్నారాయణ, చరణౌ"** అని రెండు పదాలుగా విడదీసి కొందఱు వ్యాఖ్యానించడం అసంప్రదాయమని తెలుపడంకోసం **"షట్పదమ్"** అని పదసంఖ్య నిర్ణయించి తెలుపబడింది.

**6) ఈశానాం జగతా మధీశదయితాం నిత్యానపాయాం శ్రియం**
**సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణస్యాంఘ్రీ హరేరాశ్రయే ।**
**ఇష్టోపాయతయా శ్రియా చ సహితాయాత్మేశ్వరాయార్థయే**
**కర్తుం దాస్య మశేష మప్రతిహతం నిత్యం త్వహం నిర్మమః ॥**

లోకాలకు ఈశ్వరి, సర్వేశ్వరునకు ప్రాణవల్లభ, ఒకక్షణం కూడా అతనిని విడచి ఉండనిది అయిన లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించి, శరణవరణానికి తగిన కల్యాణగుణాలను కల భగవానుని శ్రీచరణాలను ఇష్టసాధనంగా ఆశ్రయిస్తున్నాను. (ఇది ద్వయంలోని పూర్వవాక్యార్థం) లక్ష్మీదేవితో కూడి ఉండేవాడు, సర్వశేషి అయిన నారాయణునకు చేసే కైంకర్యంలో విరోధియైన మమకారం ఏమాత్రం లేని నేను ఆ స్వామికి సర్వవిధ కైంకర్యాలను ఏ అంతరాయం లేకుండా నిత్యంగా చేయడం కోసం ప్రార్థిస్తున్నాను (ఇది ఉత్తరవాక్యార్థం).

ఈ శ్లోకం ద్వయార్థవివరణాత్మకంగానే రచింపబడింది. గత శ్లోకం- పదార్థ వివరణంలో దృష్టిని కల్గినది. ఈ శ్లోకం- వాక్యార్థ ప్రతిపాదకంగా చెప్పబడుతున్నది. రెండు ఖండాలుగా ఉండే ఈ ద్వయ మంత్రంలో-పూర్వఖండం ద్వారా- లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించి, భగవానుని శ్రీచరణాలు ఉపాయంగా ఆశ్రయించడం తెలుపబడుతున్నది. ఉత్తరఖండంలో- లక్ష్మీదేవి, నారాయణుడు కలసి ఉండే సన్నివేశంలో ఆ మిథునానికి కైంకర్యం చేయాలనే ప్రార్థన తెలుపబడుతున్నది-అని రెండు వాక్యాలయొక్క తాత్పర్యాన్ని కూర్చి ఇక్కడ పల్కుతున్నారు.

ఇందులో, లక్ష్మీదేవికి మూడు విశేషణాలు ప్రయోగిస్తున్నారు. వీటికి ఏమి అభిప్రాయం? అని అంటే, వినండి. లక్ష్మీదేవి యొక్క పురుషకారత్వం అంతటి పనిని చేస్తుందా? అనే సందేహానికి సమాధానంగా, మొదటి రెండు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. ఈ జీవులందటికి తల్లియై ఆ సంబంధం కారణంగా వీరి ప్రవర్తనను చూచి సహించ లేకుండా ఉండే స్వభావం ఒకటి, భగవానునకు పత్నియై, **"పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు"** (పద్మంలో ఉండే కాంత అయిన లక్ష్మీదేవి వల్ల గొప్ప ప్రేమను కలవాడు) అనే రీతిలో అతడు తన వైలక్షణ్యాన్ని (అందాన్ని) చూచి, పిచ్చెక్కి, తాను చెప్పిన మాట ప్రకారం నడచే రీతిలోని వల్లభయై ఉండే స్వభావం ఇంకొకటి – ఈ రెండిటిని కల్గినవాడైనందున, ఏ రీతిలోను వ్యర్థం కాని పురుషకారం- లక్ష్మీదేవి పురుషకారం. లోకంలో పురుషకారాన్ని చేసేవారికి రెండు విధాలైన స్వభావా లుండాలి. ఎవరిపట్ల పురుషకారం చేయాలి, వారి విషయంలో మనసార ప్రేమ ఉండవలసిన స్వభావం- ఒకటి. ఎవరి వద్ద పురుషకారం చేయాలో, వారివల్ల తన మాట జయించే రీతిలోని వాల్లభ్యాన్ని కల్గి ఉండడం – ఇంకొక స్వభావం. ఈ రెండు లక్ష్మీదేవిలో పుష్కలంగా ఉన్నాయి – అనే విషయం ఈ రెండు విశేషణాల



ద్వారా నిరూపింపబడినది.

**"నిత్యానపాయామ్"** అనే మూడవ విశేషణంద్వారా భగవానుని ఆశ్రయించడానికి రుచి ఒక్కటే కావలసినది; కాలాన్ని చూడనక్కర లేదు – అనే విషయం తెలుపబడు తున్నది. లక్ష్మీదేవి ఎల్లప్పుడూ భగవానునితో కూడి ఉన్నది – అని తెలిసికొన్నపుడు, "పురుషకారాన్ని చేసే లక్ష్మీదేవి దగ్గరనే ఉండే సమయాన్ని చూచి ఆశ్రయించాలి" అనే కాలపరీక్షను చేయనక్కర లేదు – అనే విషయం కూడా తెలుపబడింది కదా! **"శ్రియమ్ సంశ్రిత్య"** అని అన్నందున లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించియే భగవానుని శరణు పొందాలి- అనే నియమం (ల్యబంతం ద్వారా) తెలుపబడింది. భగవానుని నారాయణత్వ ప్రయుక్తమైన స్వాభావికసంబంధాన్ని తెలిసికొని, అతనిని ఆశ్రయించే ఈ జీవునకు ఈమెను పురుషకారంగా ముందుంచు కొనవలసిన అక్కఱ ఏమి?- అని అంటే, చల్లని నీటిలో కూడ జ్వలించే నిప్పు వేడిమిని కల్గిస్తుంది కనుక, సర్వభూత సుహృత్తు అయిన భగవానుని మనస్సులో, జీవుడు అవధి లేకుండా చేసిన అపరాధాల కారణంగా కోపం కల్గుతుంది కదా! ఆ విధంగా కోపం కల్గితే, ఆ అపరాధాలను సహించడం ఈ లక్ష్మీదేవికోసమే. తన ఉపదేశాదులతో ఆ కోపాన్నిమార్చి దయను ఉద్బుద్ధం చేసేది, ఈమెయే. అందువల్ల సంబంధజ్ఞానాన్ని కలవానికికూడా అపరాధభయంతో లక్ష్మీపురుషకారాన్ని పురస్కరించుకోవడం ఆవశ్యకమే.

**(ఆశ్రయణోచితాఖిలగుణస్య)** – భగవానుని కల్యాణగుణాలు- ఆశ్రయణ సౌకర్యాపాదకాలని, ఆశ్రిత కార్యాపాదకాలని – రెండు రీతులలో ఉన్నాయి. మనవంటి వారు వచ్చి, సందేహించకుండా ఆశ్రయించడానికి అనువైన వాత్సల్య – స్వామిత్వ- సౌశీల్య- సౌలభ్యాది గుణాలు ఆశ్రయణ సౌకర్యాపాదక గుణాలు. ఆశ్రయించినవారి అనిష్టాలను పోగొట్టి, ఇష్టాలను సఫలం చేయడానికి తగిన జ్ఞానం, శక్తి, పూర్తి – అనే గుణాలు ఆశ్రిత కార్యాపాదకాలు. వీటిని మనస్సులో పెట్టుకొని **"ఆశ్రయణోచితాఖిలగుణస్య"** అని ఇక్కడ పలుకబడింది.

ఈ శ్లోకంలోని పూర్వార్ధంలో ద్వయపూర్వఖండార్థ ప్రతిపాదనంలోని **"శ్రియమ్ ఆశ్రిత్య హరేః అంఘ్రీ ఆశ్రయే"** అని పల్కి, తరువాత ఉత్తరార్ధంలో ఉత్తరఖండార్థ ప్రతిపాదనపరంగా **"శ్రియా చ సహితాయ దాస్యం కర్తుమ్ అర్థయే"** అని పల్కినందున

నిస్సందేహంగా తేటపడే ఒక సత్సంప్రదాయ సారార్థం గమనార్హం. అది ఏమంటే– పూర్వవాక్యంలో శ్రీసంబంధం అనుసంధించడం పురుషకారరూపంలో మాత్రమే– అని, ఉత్తరవాక్యంలో దానిని అనుసంధించడం – కైంకర్యప్రతిసంబంధిత్వం భగవాను నకువలె ఈమెకు (లక్ష్మికి) కూడా ఉన్నదని తెలుపడం కోసమే.

ఈ శ్లోకంలో **"ఆశ్రయే, అర్థయే"** అనే ఉత్తమ పురుషక్రియా పదాలను ప్రయోగించినందున ద్వయంలోని అర్థాన్ని భట్టరు తాము వ్యాఖ్యానించడమే కాక, తమ అనుష్ఠానశేషంగాకూడా భావించి పలికారు– అనే విశేషార్థం గమనార్హం.

## చరమశ్లోకార్థం

**7) మత్ప్రాప్త్యర్థతయా మయోక్త మఖిలం సంత్యజ్య ధర్మం పునః**
**మామేకం మదవాప్తయే శరణ మిత్యార్తోఽవసాయం కురు ।**
**త్వామేవం వ్యవసాయయుక్త మఖిలజ్ఞానాదిపూర్ణోఽహ్యహం**
**మత్ప్రాప్తిప్రతిబంధకై ర్విరహితం కుర్యాం శుచం మా కృథాః ॥**

నన్ను పొందడానికి ఉపాయంగా, నీ మనస్సును పరీక్షించడంకోసం నాచే చెప్పబడిన ధర్మాలను అన్నిటిని నీవు విడచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే ఉద్దేశించి ఆర్తుడవై, (ఆర్తిని–అభిలాషను–కలవాడవై) నన్ను పొందడానికి నేనే ఉపాయమనే నిశ్చయాన్ని పొందు. ఇటువంటి నిశ్చయంతో కూడిన నిన్ను జ్ఞానాదిగుణాలతో పూర్ణుడనైన నేను నన్ను పొందడంలో అడ్డుగా ఉండే పాపాలు ఏమీ లేనివానినిగా నిన్ను చేస్తాను. దుఃఖించవద్దు.

ఈ శ్లోకంతోను, తరువాత గల (చివరి) శ్లోకంతోను చరమశ్లోక రహస్యార్థాలను భట్టర్ వ్యాఖ్యానిస్తున్నారు. పూర్వం వివరించిన ద్వయంలోని పూర్వవాక్యంలో ఉపాయవరణమే కదా చెప్పబడుతున్నది. దానిని సర్వేశ్వరుడే స్వయంగా విధిస్తున్నాడు కనుక, అది అతనికి అభిమతమైనదనే విషయం గీతలో సారమైన **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"** అనే శ్లోకంద్వారా చక్కగా వ్యక్తమవుతున్నందున, ఈ శ్లోకాన్ని మన పూర్వులు మూడవ రహస్యంగా అనుసంధేయమని నియమించారు. **"సర్వధర్మాన్"** ఇత్యాది గీతాశ్లోకంలో శరణవరణం సర్వేశ్వరునిచే విధింపబడుతున్నది– అనేది మాత్రమేకాదు; వరణానికి అంగమైన ఉపాయాంతరపరిత్యాగం, వరణంలో



ఉపాయత్వబుద్ధిని లేకుండా ఉండడం, ప్రాప్తికి ప్రతిబంధకాలైన సకలపాపాల విమోచనం – అనే ఇవి ప్రతిపాదింపబడినందున, ఈశ్లోకం ద్వయానికి వివరణాత్మకమై ఉన్నది. పంచమవేదసారమైన గీతోపనిషత్తులోని తాత్పర్యసారమై ఉన్నది. ఈశ్లోకంలోని అర్థాన్ని ఆలకించడంకోసమే భగవద్రామానుజులు పద్దెనిమిది పర్యాయాలు తిరుక్కోట్టియూర్‌నంబి దగ్గరకు వెళ్ళారని సాంప్రదాయిక చారిత్రక కథనం. నంబికూడా, దీని అర్థంలోని గౌరవాన్ని, దీని అధికారులు అరుదుగా ఉండడాన్ని గమనించి, భగవద్రామానుజుల ఆస్తికత్వాన్ని, ఆదరాన్ని పరీక్షించడం కోసం పలుమార్లు తమ వద్దకు వచ్చే రీతిలో వారిని శ్రమపెట్టి, మాసోపవాసం చేయించి, ప్రతిజ్ఞను కూడా చేయించుకొని, క్లేశపెట్టి ఆ తరువాత దీని అర్థాన్ని వారికి పలికారు– అనే విషయం ప్రసిద్ధం.

దీనికి చరమశ్లోకమనే పేరు ఎందువల్ల కల్గింది? అని అంటే, చరమమైన ఉపాయాన్ని వ్యక్తం చేసే శ్లోకం కనుక చరమశ్లోకమనే అర్థం ఇక్కడ వివక్షితం. ఈ శ్లోకానికి పూర్వం పలు అధ్యాయాలలో కర్మయోగ– జ్ఞానయోగాదులైన కొన్ని ఉపాయ విశేషాలను మోక్షసాధనాలుగా విస్తృతంగా శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించాడు. వానిని ఆలకించిన అర్జునుడు, అవి అనుష్ఠించడంలో సులభమైనవి కావు–అని, జీవుని పరతంత్ర స్వరూపానికి స్వప్రయత్నరూపాలైన ఇవి విరుద్ధాలని భావించి, "వీటిద్వారా భగవానుని పొందడం అనే విషయం ఉన్నదా? ఇక నేను ప్రాప్యం కోల్పోవలసినదే కదా!" అని శోకించాడు. ఆ స్థితిలోని అర్జునుని ఉద్దేశించి అతని ఆ శోకాన్ని తీర్చడంకోసం, అనుష్ఠానంలో అత్యంతసులభమై, స్వరూపానికి తగినదైన ఈ చరమోపాయం చెప్పబడినందున, చరమోపాయ ప్రతిపాదకమైన శ్లోకం కనుక చరమశ్లోకమనే పేరుతో వ్యవహరింపబడుతున్నది.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య"** అనే చరమశ్లోకసూక్తిలోని అర్థాన్ని **"మత్ప్రాప్త్యర్థతయా"** అని ఆరంభించి ఒక పాదంలో పలికారు. "అన్ని ధర్మాలను విడచి" అనేది చరమ శ్లోకంలోని మొదటి పదంయొక్క అర్థం. ఒక ప్రయోజనానికి సాధనమై ఉండేది ఏదో, అదే ధర్మమనబడుతుంది. మోక్షోపాయాలను ఉపదేశించే ప్రకరణమైనందున, ఇక్కడ ఉండే ధర్మశబ్దం–ఐహికమైన స్వర్గాది ఆముష్మికమైన దృష్టఫలాలకు సాధనాలైన వానిని తెలుపకుండా, భగవత్ప్రాప్తి రూపమైన మోక్షఫలానికి సాధనాలై ఉండేవానికి తెల్పుతున్నది. ఆ మోక్షఫలసాధనాలను శ్రుతిస్మృతులద్వారా విధించినవాడు సాక్షాత్తు

భగవానుడే కనుక, **"మయా ఉక్తమ్"** అని అనబడింది. కర్మజ్ఞానభక్తియోగాలుగాని, అవతారరహస్యజ్ఞానం, పురుషోత్తమవిద్య, దేశవాసం, తిరునామసంకీర్తనం, దీపారోపణం, పూమాలికలను కూర్చడం, మొదలైన ఉపాయబుద్ధితో చేసేవిగాని, ఆయా సాధనవిశేషాలను అనుష్ఠించేటపుడు వాటికి యోగ్యతను కల్గించే నిత్యకర్మలు గాని, – ఇవి అన్నీ శ్రుతి స్మృతులచే శోధింపబడినదై, నిత్యనైమిత్తికాది రూపాలైన కర్మయోగాది రూపాలను– అని తాత్పర్యం.

**(సంత్యజ్య)** – పూర్వం చెప్పబడిన ఉపాయాల స్వరూపాన్ని బాగా గమనించి– అని అర్థం. వెండికాని ముత్యపు చిప్పలో వెండి అనే బుద్ధిని కల్గి ఉండేవారివలె, ఒక దిక్కులో పోదలచి వేఱొక దిక్కును ఆ దిక్కుగా తలచి ప్రయాణం చేసేవారివలె, భగవత్ప్రాప్తికి ఉపాయాన్ని కోరే మనం ఉపాయం కానివానిలో ఉపాయబుద్ధిని కల్గి ఉన్నామే!– అనే అనుతాప బుద్ధి విశేషంతో విడచి– అని భావం. ఉపాయాంతరాలను విడచిపెట్టే, ఆశ్రయించాలి– అనే నియమం ల్యబంతప్రయోగంద్వారా స్ఫురింపజేయబడింది. ఈ విధంగా అన్యోపాయాలను విడచే ఆశ్రయించాలనే నియమం ఎందుకు? అంటే, అన్యోపాయాలైన కర్మజ్ఞానాదులలో ఏకొంచెం అన్వయం ఉన్నా, ఇవి ప్రాప్యానికి సాధనం కాకపోవడం మాత్రమేకాక, ప్రాప్యానికి ప్రతిబంధకాలు కూడా కాగలవు. దీనికొక నిదర్శనంకూడా గమనించవచ్చు. రావణుడు శ్రీరాముని బాణాలతో చాలా బాధపడి, నిలువలేని స్థితిని పొంది ఎదురు బాణాన్ని సంధించి విడువలేని దశను పొందాడు. అపుడు కూడా శ్రీరాముని బాణాలు ఒకదాని వెంట ఇంకొకటి పరంపరగా అతనిపై పడి నాటు కొంటున్నాయి. "ధర్మయుద్ధాన్ని చేసే శ్రీరాముడు, నేను బాణాలను సంధించి విడువకున్నప్పటికీ, తాను నాపై బాణ ప్రయోగాన్ని చేస్తున్నాడే? దీనికి ఏమి కారణం?" అని రావణుడు గమనించి చూచాడు. తన చేతిలో ఇంకా విల్లు ఉండడమే దానికి కారణమని తెలిసికొని, వెంటనే ఆ వింటిని దూరంగా పారవేశాడు. అపుడు శ్రీరాముడు బాణవర్షాన్ని కురిపించడం నిలిపి, **"గచ్ఛానుజానామి"** అని అతనికి అనుజ్ఞ ఇచ్చి పంపివేశాడు.– అని శ్రీరామాయణంలో తెలుపబడింది. రావణుడు పారవేసిన ఆ విల్లు అతని చేతిలో ఉన్నపుడు ప్రత్యర్థిని జయించడానికి సాధనం కాకపోవడం మాత్రమే కాక, తనను శ్రీరాముడు ఉన్నంతసేపు బాధించడానికి కూడా కారణమైనది. ఆవిల్లు చేతిలో ఉన్నంతసేపు **"గచ్ఛానుజానామి"** (రావణా! వెళ్ళు. అనుజ్ఞ ఇచ్చాను) అనే మాట వెలువడలేదు. విల్లును పారవేసిన



తరువాతనే ఆమాట వెలువడింది. అందువల్ల విల్లు రావణునకు ప్రతిబంధకమై, ఆపద కల్గడానికి హేతువైనది– అని స్ఫుటపడుతున్నది. అదే విధమైనవి ఉపాయాంతరాలు కూడా. అందువల్ల ఉపాయాంతరాలలో అన్వయం ఉన్నంతవరకు భగవదనుగ్రహావకాశాన్ని పొందదని తెలుస్తున్నది.

**(మామ్ ఏకమ్ మదవాప్తయే శరణ మితి)** – "సర్వరక్షకుడనై నీచేతిలో మనిషిని అయిన నన్నే, నన్ను పొందడానికి ఉపాయంగా గ్రహించు"– అని భావం. దేశవిప్రకర్షంవల్ల దర్శించడానికి, దగ్గర చేరడానికి వీలు కాకుండా ఉండే పరవ్యూహాలను, అసాధారణ విగ్రహయుక్తుడు కాకుండా, ఉపాయాంతరనిష్ఠులు ఉద్దేశ్యంగా ఉండే అగ్నీంద్రాది దేవతాంతర్యామిత్వాన్ని **"మామ్"** అనే పదం నిషేధిస్తున్నది– అవతరించి, కంటికి గోచరుడై సమీపంలో ఉండే విభవరూపుడైన తనను ఉద్దేశించి కదా **"మామ్"** అని నిర్దేశించుకొన్నాడు. ఏకశబ్దం స్థానప్రమాణంవల్ల అవధారణార్థాన్ని తెల్పుతున్నది. ఈ అవధారణం ద్వారా **"వ్రజ"** అని తరువాత చెప్పబడే శరణవరణంలో ఉపాయత్వం నిషేధింపబడింది. అంటే– ప్రపత్తియొక్క అనుపాయత్వం స్థాపింపబడిందని భావం. అన్వయవ్యతిరేకాలతో ఉపాయమని స్థిరంగా భావించే శరణవరణంలో ఉపాయత్వాన్ని నిషేధించవచ్చునా? అని అంటే, శరణవరణమైన తరువాత ఇతనికి అనిష్ట నివృత్తి, ఇష్టప్రాప్తి భగవానునివల్లనే కల్గుతున్నట్లే, దానికి ముందు సంభవించే శరణవరణం కూడా ఆ భగవానుని వల్లనే సంభవిస్తున్నది– అనేదే పరమార్థం. అందువల్ల శరణవరణం ఉపాయభూతుడైన సర్వేశ్వరుని కార్యమే తప్ప ఉపాయం కాబోదు–అని సారం.

**(ఆర్తః)** – ఇది ఏపదంయొక్క అర్థం? అని అంటే, **"వ్రజ"** అనే క్రియద్వారా **"త్వమ్"** అనే కర్త ఆక్షిప్తం చేసికోవలసి ఉన్నది. దాని విశేషార్థమే ఇది. "ఉపాయాంతరాలు స్వరూపవిరుద్ధాలని క్షుద్రాలని, భావించి, చాలా విషాదాన్ని పొందిన నీవు"– అని అర్థం. **"మామ్, ఏకమ్, అవసాయమ్, కురు"** అనే ఈ పదాలు సంస్కృత మర్యాదనుబట్టి నేరుగా అన్వయించవు కనుక, **"మామేకం ప్రతి అవసాయం కురు"** అనిగాని లేక, **"మామేత ముద్దిశ్య అవసాయం కురు"** అని గాని గ్రహించాలి. అవసాయం అంటే, అధ్యవసాయం – విశ్వాసం. **"వ్రజ"** అనే పదానికి బుద్ధిని కల్గి ఉండు – అని అర్థం. **"వ్రజ-గతౌ"** అని ధాతుపాఠం కనుక, వ్రజధాతువుకు గతి

అని అర్థం. **"గత్యర్థా: బుద్ధ్యర్థా:"** అనే న్యాయంవల్ల అధ్యవసాయాన్ని చేయి – కల్గి ఉండు – అని అర్థం. **"మామేకం శరణం వ్రజ"** – నన్నే ఉపాయంగా మనస్సులో పొందు– అని అర్థం.

**"మామేకం శరణం వ్రజ"** – నన్నే ఉపాయంగా మనస్సులో గ్రహించు – అని తెలిపినట్లయినది. **"శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్‌కైయినాలుమ్"** (మనస్సుతో, వాక్కుతో, చేతలతో) అనే రీతిలో మనోవాక్కాయాలు మూడిటిలోను ఉండే స్వీకారం అధికారపూర్తికి పనికివస్తుంది కనుక,వాచికం, కాయికం, ఈ స్వీకారానికి ఆవశ్యకమై ఉన్నా, **"జ్ఞానాత్ మోక్షః"** అని చెప్పబడుతున్నందున ఆ రెండిటిని కాక, మానసమైన అనుష్ఠానాన్ని మాత్రం తెలుపుతున్నది.

ఇక,ఉత్తరార్ధం ద్వారా – చరమశ్లోకంలో ఉత్తరార్ధంలోని భావాన్ని తెల్పుతున్నారు.

**(అఖిలజ్ఞానాది పూర్ణో హ్యహమ్)** – సర్వజ్ఞుడనై, సర్వశక్తినై, ప్రాప్తిని కలవాడనైన నేను – అని భావం. మిగిలిన కల్యాణగుణాలన్నీ ఉండగా, ఈ గుణ విశేషాలను ఈ **"అహమ్"** అనే శబ్దం తెల్పుతున్నది– అని అనడం ఏ విధంగా? అని అంటే, ఈ జీవునకు అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని చేయగల్గిన అవధిలో ఇతడు దీనికి ముందు ఉన్న స్థితిని, తరువాత పోదగిన మార్గాన్ని తెలియడానికి, తెలిసిన రీతిలో చేసి కార్యం పూర్తి చేయడానికి ఆవశ్యకమైన భగవానుని గుణాలు ఏవి? అంటే – సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాలు, కార్యాన్ని సఫలం చేసేటపుడు, ఇతని కోసం కాకుండా తన ప్రయోజనంగా భావించి చేయడానికి తగినది ప్రాప్తశేషిత్వం. అందువల్ల సర్వజ్ఞత్వ– సర్వశక్తిత్వ– ప్రాప్తశేషిత్వాలనే ఈ మూడు విశేషగుణాలకే ఇక్కడ ఔచిత్యం ఉన్నదని తెలియాలి. **"జ్ఞానాది"** అనే చోట గల ఆదిశబ్దంద్వారా శక్తిని, ప్రాప్తిని గ్రహించాలి.

**(ఏవం వ్యవసాయయుక్తం త్వామ్)** – నీ కార్యాలను తెలియడానికి తగిన జ్ఞానం లేనివాడవై, తెలిసినా కార్యాన్ని పూర్తి చేయడానికి శక్తి లేనివాడవై, శక్తిని కల్గిఉన్నా, స్వరక్షణలో సంబంధం (ప్రాప్తి) లేనివాడవై– ఈవిధంగా ఉన్నందున సర్వ ధర్మాలను విడచి, నన్నే ఉపాయంగా ఆశ్రయించడమనే అధ్యవసాయంతో కూడి ఉండే వాడవైన నిన్ను – అని అర్థం.

**(మత్ప్రాప్తి ప్రతిబంధకై ర్విరహితమ్ కుర్యామ్) – "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"** (అన్నిపాపాలనుండి విడిపిస్తాను)– ఇష్టవిరోధియై, అనిష్టహేతువై ఉండేది పాపం. ఇది మోక్షప్రకరణం కనుక, భగవానుని పొందడానికి ఏవి విరోధాలో, అవియే ఇష్టవిరోధులు. అందువల్ల, "నీవు నన్ను పొందడానికి ఏవిరోధులని ఏయే పాపాలనుండి భయపడుతున్నావో, ఆయా పాపాలనన్నిటి నుండి నిన్ను విడిపిస్తాను"– అని భావం.



**(శుచం మా కుర్యాః)** – స్వరూపవిరుద్ధాలు,అపాయబహుళాలైన ఉపాయాంతరాలను విడువమని చెప్పినందున, స్వరూపానురూపం, నిరపాయం అయిన సిద్ధసాధనాన్ని స్వీకరించమని చెప్పినందున, ఇక శోకనిమిత్తం ఏమీ లేనందున, "శోకాన్ని పొందకు"–అని చల్లని చేతులతో కన్నులను తాకి కన్నీళ్ళు తుడిచిన రీతి ఇది.

ప్రతిబంధకనివృత్తిపూర్వకమైన భగవత్ప్రాప్తియే ఫలమై ఉండగా, ఇక్కడ భగవత్ప్రాప్తిని చెప్పకుండా ప్రాప్తిప్రతిబంధకనివృత్తిమాత్రం శ్లోకంలో పల్కడం ఎందుకు? అని అంటే, సకల ప్రతిబంధకాలు తొలగిపోగానే స్వరూపానికి అనుబంధమైన భగవత్ప్రాప్తి తనకు తానే సిద్ధిస్తుంది కనుక, దానినిగూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేదని భగవదభిప్రాయం.

8) **నిశ్చిత్య త్వదధీనతాం మయి సదా కర్మాద్యుపాయాన్ హరే**
**కర్తుం త్యక్తుమపి ప్రపత్తు మనలం సీదామి దుఃఖాకులః ।**
**ఏతత్ జ్ఞానముపేయుషో మమ పునః సర్వాపరాధక్షయం**
**కర్తాసీతి దృఢోఽస్మి తే తు చరమం వాక్యం స్మరన్ సారథేః ॥**

ఓ హరీ! నేను సదా నీకే అధీనమైన స్వరూప స్థితిప్రవృత్తులను కలవాడననే విషయాన్ని నిశ్చయించుకొని, కర్మయోగం మొదలైన ఉపాయాలను అనుష్ఠించడానికి, విడువడానికి, ప్రపత్తి చేయడానికి అసమర్థుడనై చాలా దుఃఖపడుతున్నాను. పార్థసారథివి అయిన నీవు పల్కిన చరమ(చివరి) వాక్యాన్ని (చరమశ్లోకాన్ని) స్మరించే వాడనై, "భగవానుడే ఉపాయం – అని నిశ్చయించుకోవడ మనే ఈ జ్ఞానాన్ని పొందిన వాడనైన నా అపరాధాలను అన్నిటిని క్షయింపజేసేవాడవుగా నీవు కాగలవు" – అని నమ్మి, దుఃఖాన్ని లేనివాడనై, నిర్భయంగా ఉన్నాను.

గత శ్లోకంలో చరమశ్లోకార్థాన్ని వివరించి, పూర్తిచేసినా, **"మా శుచః"** అని అనడానికి హేతువైన శోకనిమిత్తాన్ని, దాని నివృత్తి ప్రకారాన్ని ప్రదర్శిస్తూ, ఈ దేహసంబంధం తొలగేవరకు తమకు నిర్భరత్వానుసంధానం లోటు లేకండా ఉండే రీతిని ఉపపాదిస్తూ, ఈశ్లోకంతో ఈ ప్రబంధాన్ని పూర్తి చేస్తున్నారు.

ఈశ్లోకంలోని పూర్వార్థంద్వారా శోకం కల్గడానికి కల హేతువును తెల్పుతున్నారు.

**(హే హరే! మయి త్వదధీనతాం సదా నిశ్చిత్య)** – "అత్యంతపారతంత్ర్యమనే నా నిష్కృష్టస్వరూపాన్ని అనుసంధించి" – అని అర్థం. శాస్త్రాలలో విధింపబడిన కర్మయోగాదులైన ఉపాయాలను విడువడానికి కారణం – వాటిని గూర్చి తెలిసికోవడానికి, వానిని అనుష్ఠించడానికి తగిన జ్ఞానశక్తులు తనకు లేకపోవడమే కాదు; భగవానునకు అత్యంతం పరతంత్రుడై ఉండడమనే స్వరూపానికి తగదు – అనేదే ముఖ్యహేతువు– అనేది సదాచార్య సిద్ధాంతమైనందున, అది ఇక్కడ ముందుగా తెలుపబడుతున్నది. తన రక్షణలో స్వప్రయత్నగంధ లేశాన్ని కూడా సహించని తన స్వరూపాన్ని యథాతథంగా భాసింపజేస్తాయి. స్వరూపయాథాత్మ్యజ్ఞానాన్ని కలవారికి అవి అపాయాలుగానే తోస్తాయి. అత్యంత పారతంత్ర్యమనే స్వరూపానికి స్వప్రయత్న రూపాలైన అన్యోపాయాలు స్వరూపనాశకాలే కదా!

నమ్మాళ్వార్లు, పెరియతిరువన్దాది ప్రబంధంలో **"నెఱి కాట్టి నీక్కుదియో? నిన్బాల్"** అని ఆరంభించి పల్కిన పాశురం ఇక్కడ ప్రమాణంగా అనుసంధేయం. ఈ పాశురంలోని అర్థాన్ని వినండి. **నెఱి –** అంటే– మార్గం. మార్గమంటే –ఉపాయం. చరమశ్లోకానికి ముందు విస్తృతంగా చెప్పబడిన ఉపాయాంతరాలను ఇక్కడ **"నెఱి"** అని అంటున్నారు. భగవానుడు ఎవరిని అనుగ్రహించదలచాడో, వారిని ఉద్దేశించి, "మీరు ఏవిధమైన శోకాన్ని పొందవద్దు. నన్నే శరణంగా నిశ్చయించుకొని, గుండెలపై చేయిపెట్టుకొని నిద్రించండి" అని అంటాడు. ఎవరిని చేయి విడవాలని అనుకుంటాడో, వారికి దుష్కరాలైన కార్యాలను అంతులేకుండా విధించి "వీటిని ఋజువుగా ఆచరించి ప్రాప్య సిద్ధిని పొందండి" అని అంటాడు. అందువల్ల **"నెఱి"**ని చూపించడం అనేది, తమకు దూరంగా నెట్టివేయడం అనేది పర్యాయాలు .నెఱిని (మార్గాన్ని) చూపించడం అంటే– "ఇది కర్మయోగం, ఇది జ్ఞానయోగం, ఇది భక్తియోగం. వీటిలో ఏది మీకు ఆచరణ సాధ్యమో దానిని ఆచరించండి" అని పల్కి తాను ఉదాసీనుడై ఉండడమే. **"నెఱి కాట్టి నీక్కుదియో నిన్బాల్?"** నిన్ను కాకుండా వేఱొక ఉపాయాన్ని చూపించి, నీనుండి నన్ను దూరం చేయాలని చూస్తున్నావా?– అని అంటూ నమ్మాళ్వార్లు భగవానుని చూచి ప్రశ్నిస్తున్నారు. ఈ రీతిలో ఈ పాశురంలో, ఉపాయాంతరాలలో అన్వయాన్ని పొందడం భగవానునకు దూరం కావడానికి కారణమవుతుంది– అనే భావం స్పష్టపడుతున్నది.



**(కర్మాద్యుపాయాన్ కర్తుమ్ అనలమ్)** – పూర్వం వివరించిన ఉపాయాలు స్వరూపవిరుద్ధమైనవి అయినందున, దుష్కరాలైనందున, సాపేక్షాలు అయినందున, ఆలస్యంగా ఫలాన్ని ఇవ్వగల్గినవి అయినందున, చిరకాలం అనుష్ఠించవలసినవి అయినందున, అనేకాలు అయినందున– వీటిని వాటిని అనుష్ఠించడంలో అసమర్థుడనై,

**(త్యక్తుమపి అనలమ్)** – వర్ణాశ్రమోచితాలై, అభిమతఫల– సాధనాలైనందున శాస్త్రాలలో విధింపబడిన ధర్మాలను విడువలేనివాడనైనందున – అని అర్థం. వీటిని విడువలేకపోవడానికి కారణం – ప్రత్యవాయభీతి.

**(ప్రపత్తుమపి అనలమ్)** – స్వరూపానురూపత్వం, గుణరూపత్వం, నిరపాయత్వం, సిద్ధత్వం, స్వతఃఫలసాధనత్వం, నిరపేక్షత్వం, ఆలస్యం లేకుండా ఫలాన్ని ఇవ్వడం, ఒకేవిధమైనదై ఉండడం మొదలైనవానివల్ల సుకరమై ఉండే ఉపాయం శోకనివృత్తి కోసం చెప్పబడినప్పటికీ, దానిని అంగంగా విధింపబడిన సర్వధర్మత్యాగం చేయలేనందువల్ల, ఆర్తి లేనందువల్ల, ఆకించన్యం లేనందువల్ల, మహావిశ్వాసం లేనందువల్ల, సర్వధర్మత్యాగాన్ని అంగంగా కల ప్రపత్తిని కూడా చేయడానికి అసమర్థుడనై ఉండే నేను – అని భావం.

**(దుఃఖాకులః సీదామి)** – శోకావిష్టుడనై తల్లడిల్లుతున్నాను. ఈవిధంగా ఇంతవరకు శోకనిమిత్తాన్ని గూర్చి పల్కి, తరువాత శోకనివృత్తిహేతువునుగూర్చి పల్కుతున్నారు.

**(సారథేః తే చరమం వాక్యం స్మరన్ సన్, ఏతత్ జ్ఞానం ఉపేయుషా మమ సర్వాపరాధక్షయం కర్తాऽసీతి దృఢోऽస్మి)** – వాత్సల్యాతిశయంచేత అర్జునుని తేరు ముందు నిలచిన, పరమాప్తుడవైన నీవు **"సర్వధర్మాన్"** ఇత్యాది చరమశ్లోకార్థాన్ని అనుసంధించేవాడనై –అని అర్థం. ఇందులో, పూర్వార్ధంలో పల్కిన భగవదేకోపాయత్వాధ్యవసాయాన్ని (భగవాను డొకడే ఉపాయమనే దృఢవిశ్వాసాన్ని) నీ అనుగ్రహంవల్ల పొందిన అజ్ఞానిని, అశక్తుడను అయిన నేను, నీవు అవిద్య, కర్మ, వాసన, రుచి , ప్రకృతి సంబంధాలనే సకల పాపాలయొక్క వినాశాన్ని కల్గించగల వాడవనే దృఢమైన నమ్మికను కల్గి ఉన్నాను– అని భావం. **"దృఢోऽస్మి"** – అనే పదానికి విషాదం తొలగి నిర్భరుడనై ఉన్నాను – అని తాత్పర్యం.

ఈ శ్లోకంలోని పూర్వార్ధంలో **"సీదామి"** అని, ఉత్తరార్ధంలో – **"దృఢోఽస్మి"** అని పల్కినందున, తనను చూచినపుడు అవసాదం, భగవానుని కల్యాణగుణాలను చూచినపుడు తన్నివృత్తిపూర్వకమైన నిర్భరత్వానుసంధానం ప్రపన్నుడనే అధికారికి యావజ్జీవం అనువర్తిస్తుంది – అని తెలుపబడింది.

